అరుణా పబ్లిషింగ్ హౌస్ తరఫున—

1వ ముద్రణ : 1989 జూలై
2వ ,, : 1993 మార్చి
3వ ,, : 1995 ఫిబ్రవరి



రచనా కాలం : 1935

ధర : 12 రూ.లు

ముద్రణ :
శ్రీ అరుణోదయ ప్రింటింగ్ ప్రెస్
సీతారామపురం, విజయవాడ-2. ఫోన్:431422

# అరుణ

గాలి ఆడదు: కుర్చీ ఏ వేపు జరుపుకున్నా వూపిరాట్టం లేదు. చొక్కాలోంచి కుర్చీ కేన్వాస్ తడిసింది. గోడలు చెమరుస్తున్నట్టు తోస్తున్నాయి. చదువుకుందామంటే దీపం చుట్టూ పురుగులు, అదీగాక సినిమా చూసిం తరవాత, కళ్ళ నెప్పులు, ఇంక అనుభవాలు తగ్గించుకోమని మధ్య వయసు యిస్తున్న సిగ్నలా?

పుస్తకం తీశాను గాని, సినిమాలో, సైగల్ "దుఖకే" అని పాడుతో మధ్యలో నవ్విన నవ్వులోని విషాధం (bitterness) మనసుని బాధిస్తోంది. "ఏక్ స్వప్న కా దుఖకే!"

"మిస్టర్ సయ్యద్ లుక్డ్ ఎబ్రప్ట్లీ వైల్డ్ (Mr. Syed looked-abruptly wild) అని నేను చదువుతున్న పుస్తకంలోని వాక్యం నా వెనకనించి ఎవరో చదివారు. గుండె ఆగింది. ఆ కంఠం యెవరిది? రెండేళ్ళ మరుపుల కింది నించి ఎన్నో ప్రాణాల్ని పీల్చిన సంఘటనలు జ్ఞాపకం వొచ్చాయి. తల యెత్తబోయినాను, వెనక్కి సంతోషంతో. నా చంపల్ని రెండు పెద్ద చేతులు పట్టుకుని తిరగనీ లేదు. గాజులు, అరవై రక రకాల గాజులు, పొడుగాటి వేళ్ళు. నా మొహాన విశ్వనాథ ఆయిల్ పరిమళాలు చిమ్ముతో మెలికలు జారిన కణతల మీది జుట్టు — గంటల గంటల మోస్తరు నవ్వు—సహారాలో వొంటెలమెళ్ళో గార్డెన్ ఆఫ్ అల్లా (Garden of Allah) సినీమాలో విన్న గంటల చప్పుడు జ్ఞాపకం

తెచ్చే నవ్వు—ఒక్కసారి విన్న తరవాత యింక జీవితంలో శాంతి సంపూర్ణంగా నశించిందని స్పష్టంగా తెలియచేసే నవ్వు—ఇంకెవరు?

"అరుణ."

పేరు చెప్పినా వొదలలేదు. మెల్లిగా నవ్వుతోంది. రక్తం ఆగింది. "అరుణేనా, లేక—" తలుపు గడియ వేసి రాత్రికి యిల్లు భద్రం చేసుకుని ఒచ్చాను. ఎట్లా ఒస్తుంది. లోపలికి, పైకి! చచ్చిపోయి....అవును అరుణ అట్లానే యే రైలులోనో .... యే ఆలింగనంలోనో నాటకశాలలోనో .... చచ్చిపోతుందని నా నమ్మకం. చచ్చిపోయే చివరి నిమిషాన నా దగ్గిరికి కాక ఇంకెక్కడికి వెడుతుంది—కడపటి శలవకోసం? ఇంక కనపడనని తెలపడం కోసం?

ఆలిస్యం భరించలేను. భయ మెక్కువవుతోంది. నా జుట్టుని ఆమె వేళ్ళ సందుల్నించి ఒదిలించుకుంటో, గట్టిగా వెనక్కి తిరిగాను, అరుణే! నవ్వుతోంది. గంటలు-గంటలు—గోడల మధ్య యిటూ అటూ మోగుతున్నాయి. కాని, పెదిమల మీద కాని, కళ్ళల్లోగాని ఒక్కరవ్వ నవ్వు లేదు. ఆ శక్తి ఒక్క అరుణకే వుంది. అట్లా నవ్వే శక్తి.

వూదా శిల్కు చీరె, సినీమాస్టార్ జాకెట్, తాంబూలం.

"నువ్వేనా? మాట్లాడు."

నేను లేచి దగ్గిరికి నడిచినకొద్దీ దూరమయింది. మెల్లిగా గోడ దగ్గిరిగా నీడను కలుసుకుంది. నా కళ్ళు తిరిగాయి. పడబోయినాను.

"ఏమిటిది?"

గట్టిగా నన్ను పట్టుకుంది.

మెడ, బుజాలు, చంపలు తాకుతున్నాను సంతోషంతో.

"ఎట్లా ఒచ్చావు? ఎంత భయపెట్టావు!"

"ఏం? రైళ్ళులేవా? మోటార్లులేవా?"

"అది కాదు. తలుపు గడియ వేశాను."

లోపలి నవ్వు పెదిమలమీదికి పాకింది అప్పుడు. తాంబూలంతో యెర్రనైన పెదిమల లోపలి యెరుపు మీదికి. కాని కళ్ళు అగాధంగా లోపలికి తిరిగి—అరుణ కళ్ళు ఎవరి వంకా చూడవు సాధారణంగా, చూసిందా ఇంక ఆ కళ్ళ లోతేమిటో తెలుసుకున్నదాకా వదలకూడదని—ఇంక విముక్తిలేదు యువకులకి, జల గుండాను పడ్డట్టే—కొండశిలవ నోట్లో చిక్కినట్టే! వెర్రివాళ్ళు ఆ చూపుల అంతం కనిపెట్టగలమనే ప్రతి వారికీ ఆశ! రాచకన్యవేసే ప్రశ్నకి జవాబు చెప్పగలమనే శిరస్సులు వప్ప చెప్పే, మూర్ఖులు జ్ఞాపకం ఒస్తారు. ఇక్కడ మెడలు కాదు. హృదయాలు అంతే. కాని తలలు తెగడమే తక్కువ బాధ!

"తలుపు గడియ వేశావా? పిచ్చిముండా, యెట్లా బతుకుతావు ఇంత మతిమరుపుతో!"

"వేశాను."

"వేస్తే నే నెట్లాఒస్తాను?" అరిచింది స్కూలు పిల్లవలె. వరండా దగ్గిరకి పోయి బండి వాణ్ణి సామాను పైకి తెమ్మని కేక వేసింది.

"భోజనం అయినట్టుందే!" అన్నాను.

"అయిందే."

ఇన్నేళ్ళ స్నేహంలోను, నా పేర్లు అనేక సార్లు మార్చింది. పైగా యిప్పుడు ఆడదాన్ని లాగు సంబోధించడం ప్రారంభించింది. వుత్త చెల చిత్తమేనా, లేక ఏమైనా అగాధమైన కారణం వుందా? ఆమెకీ తెలీదు బహుశా.

"అయిందే....కాని, పిచ్చీ! యెట్లా బతుకుతావు యిట్లా ఒంటరిగా. నిన్ను చూసినప్పుడు పాపం, నీ బట్టలు వుతికి పెడుతో, నీకు కబుర్లు చెపుతో వుండిపోవాలనిపిస్తుంది. కాని—" ఊరుకుంది.

"కాని—"

"ఉండనీదుగా పాడు లోకం?"

"ఇంకా లోకాన్ని చూసి—"

"భయం కాదులే, పిచ్చిముండా!"

ఆలోచించాను. లోకమంటే ఆకర్ష కులైన యువకులన్నమాట అని నిశ్చయించుకున్నాను.

"ఈసారి నీతో వుంటానమ్మా? పాపం! ఎన్నో రోజులు!!"

"ఎన్ని!"

"రెండేళ్ళు."

"రెండేళ్ళే!"

నాకూ తెలుసు ఆమెకీ తెలుసు, రెండేళ్ళంటే రెండు గంటలో, రెండు రోజులో! నాకు తెలుసుననీ ఆమెకి తెలుసు, కాని రెండేళ్ళు వుండాలనే కోర్కె అబద్ధంకాదు ఆమెలో! వుండననే సందేహమూ ఉండక పోలేదు.

"ఈసారి చూడు వుండనేమో?"

అని నా చంపకి తన చంప ఆనించి "ఊ" అంది కంఠంలోంచి పెదవులు తెరవకుండా, గ్రేటా గార్బోమల్లె. చప్పున నన్ను వొదిలి నుంచుని.

"కలం, కాయితం కావాలోయి."

నన్నట్లా వొదలడం, అంత చప్పున నాకు ఇష్టంలేదు. కాని అరుణని బతిమాలడం. ఆకాశంలో యెగిరే చిలకని పిలిస్తే యెంత లాభం, అంతే. ఆమె స్వేచ్ఛగా వరాలు కురిపించాలి. ప్రార్థనలూ, కన్నీళ్ళూ పని చెయ్యవు. కాని తనని యిష్టమైనప్పుడు ప్రార్థనలకీ, కన్నీళ్ళకీ లొంగి పోయినాననే ఇల్యూజన్ (illusion) కల్పిస్తుంది. నేను పకపక నవ్వాను.

"ఏమిటి?" అంది కంటిమీది కనుబొమ్మని పక్కకి లాగి.

"ఉండడానికి ప్రయత్నాలా?"

మాట్లాడకుండా బుజాలు పట్టుకుని వూయించింది,

ఇష్టంలేని ప్రసంగాల్ని తప్పించే ఆమె పద్ధతుల్లో అది వొకటి. మాసిన గుడ్డల బుట్టలోనూ, గ్రామఫోను పెట్టెలోనూ, వెతికాము. కలం కాయితాలకోసం "నేనే వుంటేనా" యిట్లా చీదరగా వుంచుతానా యిల్లు? అంతా నా అజ్ఞలో-నిజం చెప్పు భోజనం చేశావా యీ రాత్రి—"

"ఆ"

"ఏం వేసుకుని?"

నా మెడని వొంచి చూస్తోంది కళ్ళలోకి.

"నిజం చెప్పు. అబద్ధాలు చెప్పావా...."

పళ్ళు చూపించింది. మామూలు, ఆ బెదిరింపు మాటు, ఆ డాబా మీది అమవాస్య రాత్రి నించి.

"ఊఁ, నిజం చెప్పు మరి" ఎప్పుడూ అంతే, అబద్ధాలన్నీ తన 'మోనాపలీ' లాగు మాట్లాడుతుంది అరుణ.

"లేదు. కాని కాఫీ—"

"పో దుర్మార్గుడా!" అని నన్ను తోసేసి కుర్చీలో కూచుని రాసుకుంటోంది. అరనిమిషంలో నన్ను మరిచిపోయి. అదే అరుణలో మనసుకి వెర్రెత్తించేదీ, మనసుల మీద తీవ్రమైన మాయేకప్పేదీ, ఆ గొప్ప ఘోర గుణమే. దేని మీద మనసు నిలిపితే అదే లోకం, తక్కిన లోకం జావురుమని ఏడుస్తుంది.

నాతోనూ అంతే.

ఇదుగో వస్తానని-వొదలలేక వొదలలేక బండి యెక్కుతుంది. మళ్ళీ యే రెండేళ్ళకో దర్శనం—ఏ ఆరు నెలలకో ఉత్తరం.

వెనకాలే వెళ్ళి నుంచున్నాను చదవా లనుకోకపోయినా, ఆమె ఉత్తరంలో రాసిన యీ వాక్యం నా కళ్ళబడ్డది.

"దిగులుపడకమ్మా! నిన్ను! కలుసుకోడానికి వీలులేకపోయింది. నాకు తెలుసు నీ బాధ! ఒస్తాను! తప్పకుండా ఒస్తాను, నీకు తృప్తి నిస్తాను."

ఇందాక నా చంపని జారిన జుట్టు ఇప్పుడు ముందున్న కాయితం మీద పడుతోంది. ఆ వుత్తరం మర్నాడు చదువుకునే నిర్భాగ్యుడికి ఆ విశ్వనాధ్ ఆయిల్ పరిమళం గుండెల్ని పీకుతుంది.

కలం ఆ వేళ్ళ మధ్య ఉండడమే ఆనందంలాగు గంతులేస్తోంది. ఎవరికో? ఎందుకో? అడిగితే చెబుతుందేమో! కాని అడగననేగా, నా మీద అంత యిష్టం. అంత విశ్వాసం!

ఎక్కడ్నించి ఒచ్చిందో! ఎంత దూరంనించో, పాదాలమీదనన్నా దుమ్ములేదు. పాదాల మీద జీరాడే పట్టంచునించి, తలపైన నిగనిగలాడే జుట్టు పాపిడి వరకు చూస్తో నుంచున్నాను. అప్పుడే గదిలో అలంకరించుకుని బైటికి ఒచ్చిన దానిమల్లే వుంది.

జీవితమంతా, ముళ్ళలోంచి, దుమ్ములోంచి, ద్వేషాలలోంచి, నిందల్లోంచి, అపనిందల్లోంచి అంత నిర్మలంగా నడిచి శుభ్రంగా, పవిత్రంగా ఉండగలిగే వారు అరుదు. తామరాకుమీది నీటిబొట్టు, ఆకునుంచి కిందికి జారే వెన్నెలరేఖ! నడిచిన చోటనల్లా హృదయాలమీద అడుగులు పెడుతో వెడుతుందంటే ఒక వింతా!

తీవ్రమైన వాంఛ నా కళ్ళకి పొరలు కప్పక పోవడంచేత, ఆమె అందాన్ని చాలా స్పష్టంగా చూడ గలుగుతున్నాను. ఈ మాయా ప్రపంచంలో ఇంకా చిక్కని మాయ ఈ ప్రేమ మాయ-స్త్రీ వాంఛ! ఆ మోహమే ముక్కు పట్టుకుని-"తాను వలచింది రంభ" చేస్తుంది.

శాంతంగా, బొమ్మనివలె చూస్తున్నాను—రాని కాంక్షే వుంటే, ఆమె నాదేనని తెలిసికూడా,-మా మొదటి స్నేహపు మొదటి రాత్రి జ్ఞాపకం

వొచ్చింది. అర్ధ రాత్రి, బృహస్పతి కాంతి కింద డాబామీద అలింగనం ఒత్తుకునే మా నగ్న వక్షాలకీ—బృహస్పతి పెల పెల కాంతికీ, మా కామోద్రేకానికీ—యీ సృష్టి జీవనోద్యమానికీ, మధ్య యేమీ అడ్డంలేని అ

కాని కాంక్షే వుంటే—ఎంత బాధ! అ వుత్తరం రాయడం ఎప్పుడు ముగుస్తుందా అని విసుకు: నిలవలేక ఆమె వెనకకి వెళ్ళి అనుకోవడం, ఎక్కడినించి వొచ్చింది అని జెలసీ, ఎప్పుడు వెళ్ళిపోతుందో అని భయం! ఇవేం లేవు ఇప్పుడు-కాని ఆ మొదటిరాత్రి—ఆమె నా కళ్ళలోకిచూక, బృహస్పతివేపు చూడడం, ఆమె కనుపాపల్లో ఆ నక్షత్ర కాంతి ప్రతి ఫలించడం భరించలేక పోయినాను-ఆ రెండో పక్కన పట్టు జంపఖానా ఆమె వీపుని తాకడం సహింపలేక, అన్ని వేపులా నేనే కావడానికి ప్రయత్నించాను. కాని ఆ మోహం లేకపోవడం బాధిస్తోంది నన్ను యీ రాత్రి. ఈమె ఈ రాత్రికి ముందు నేనెరక్కుండా, కొత్తగా, యింత చనువుతో, యింత అందంతోనూ వొచ్చి వుంటే, కొత్తగా నేను చూస్తే-ఎంత రసం, కాంతి, ఉత్సాహం, కలిగేది జీవితంలో—యీ ఘడియలు యెంత గొప్పగా వెలిగేవి?" రూప్ నగరమే దిల్ ముసాఫిర్ సౌధా ప్రేమ కరిలే."

వెళ్ళి గ్రామఫోన్ మీద కె. సి. డె. రికార్డు పెట్టాను.

అరుణ తలెత్తి నవ్వింది.

"దేని సహాయం తెచ్చుకున్నావా?" అని మళ్ళీ రాసుకుంటోంది.

పాట అఖరయింది. వైండ్ (Wind) చేస్తున్నాను.

"వొద్దు. ఇంకేమీ వొద్దు-" అని రాసుకుంటూనే—"అవును ప్రేమ సౌధా కరిలే" అంటోంది.

"ఎన్ని సౌధాలు?" అన్నాను.

పెదిమల మీదీ చిరునవ్వు నాకు జవాబు చెప్పింది.

"నువ్వు మాత్రం?" అంటూ లేచి వొచ్చి నా మెడ చుట్టూ చేతులు వేసి తల భుజం మీద పెట్టి—

"కాని యీ సౌధం—యే భూకంపం రానీ యిది కదలదు. తలుపులు గడియలు వేసుకోదు—"

"ఇదీ. ఇదీ పిచ్చిముండ—వృత్త ముసాఫిర్ బంగళా—" అని గట్టిగా నవ్వింది. చెవుల్లో స్వర్గ ద్వారాల గంటలు ఘల్లుమన్నాయి.

"దిల్ ముసాఫిర్—అంతే" అన్నాను.

"చూడు. ఈ వుత్తరం పోస్టులో పడాలి."

"ఇప్పుడా? అరమైలు—"

"నేనూ వొస్తాను."

రాదనీ తెలుసు, నేను వెళ్ళాలనీ తెలుసు.

"నువ్వెందుకులే!"

అనకముందే చెప్పులు తెచ్చి, రూచుని కాళ్ళకి పెట్టింది.

"బహుమానం?"

"ఏముంది? కొత్తది యేమియ్యను?"

జాలిగా నవ్వింది.

మెల్లిగా జాలిగా గంట మోగింది ఆకాశాన.

ఆ నవ్వుకోసం యేంచెయ్యకుండా వుండగలను—పూర్వపు మోహమంతా చల్లబడి గడ్డకడితే మాత్రమేం!

"నువ్వు వొచ్చిందాకా యీ కళ్ళని తెరిచే వుంచుతాను."

"మళ్ళీ వొచ్చేటప్పటికి వాకిలి గుమ్మం వెనక నించి గట్టిగా అదుముకుంది.

"చాలదా?"

ఇదంతా కొత్తగా మొదటిసారి కాకూడదా? కాని యెన్నోసార్లైతేనేం? ఆమె రొమ్ముకి హత్తుకోడం! కృతజ్ఞత! ఎందరు తపస్సు చేస్తున్నారో ఆ అదృష్టం కోసం. నే నెరిగిన వాళ్ళని లెక్కపెట్టనా? మేము యెక్కుతున్న మెట్టు మెట్టుకీ ఒక్కరు చొప్పున!

"నిద్ర వొస్తోంది. పక్కలు వేసుకుందాం."

ఎన్ని బహువచనాలు! ఏమిటీ సూచన?

పాపం అలిసి పోయింది. పక్కవేసి పెట్టాలి. కాని నానించి పని కావలసి నప్పుడల్లా అలిసే వుంటుంది, అన్న దుర్మార్గమైన తలపు మనసులోనించి తోసేశాను.

"వుత్తరం యెవరికో చూశావా, పై పేరు?"

"ఊ—వాడెవరా అని కూడా అనుకున్నాను."

"అతను, ఆ స్టూడెంటు, నేను సుమిత్రని చూడ్డానికి కాలేజీకి వెళ్ళినప్పుడు, నాకు ఆమె గది చూపించాడు. చాలా బీదవాడుగా కనబడ్డాడు. క్షయట. డబ్బు లేనట. దయగా మాట్లాడాను. నేను చేసిన తప్పు అదీ. అనాటి నించి వుత్తరాలు కురిపిస్తున్నాడు."

"ఎందుకు?"

"ఏముంది? మొగాళ్ళకి మామూలేగా—" అని కంఠం మార్చి—

"పాపం—ఎట్లానూ బతకడు చాలా రోజులు, చదువు మానెయ్యమన్నాను. తల్లి వంటచేసి అంతవరకు చదువు చెప్పిస్తోందట కొడుకు పోషిస్తాడని గంపెడాశ!" కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

"నన్ను చూస్తే జీవితానికి కొత్త వెలుగు కనపడ్డది"- అని రాసాడు. కాని ఏం లాభం?"

ఆమె పక్క తీసుకొచ్చి విప్పాను. ఆ పచ్చని దుప్పటీమీద యెర్రని కొత్త పట్టుదిండు. ఆ పువ్వుల మధ్య వి. కె. అని రంగుల దారంతో కుట్టిన అక్షరాలు.

"ఎంత బావుందో!" అన్నాను.

"రేపు పొద్దున్నే వెళ్ళేప్పుడు నీకిచ్చి పోతాను."

"రేపు పొద్దున్నా ! ఏదో రెండేళ్ళున్నావు ?"

"అవునులే-వూరికే అన్నాను."

"ఏది వూరికే?"

"రావే పడుకుందాం, నిద్రవొస్తోంది." అని పక్కమీద పడి నా మెడ మీద చెయ్యేసింది.

"నీకో? దిండు నాకిస్తే ?"

"ఇయ్యను నీకు. నూనె చేస్తావు. ఎందుకు అంత నూనె రాసుకుంటావు? అయినా నీ కిచ్చి ఏం లాభం! రేపు సాయంత్రానికి ఆ దొడ్లో బావి దగ్గర వుంటుంది. ఏ ముష్టివాడో తీసికుపోయి అమ్ముకుంటాడు."

"ఇయ్యనా?"

"పాపం, ఇస్తాలేవే!" అంటూ నవ్వుతోంది – కలకల మన్నాయి గుళ్ళో గంటలు.

"ఎందుకు ?"

"ఈ దిండు! నేను షాపులోంచి వొచ్చేస్తో వుంటే, ఆ వూళ్ళో ఒకడు గుమ్మంలో అడ్డంగా నుంచున్నాడు. లావాటివాడు, బ్రహ్మాండమైన మీసాలూ వాడూ-గంటనించి నా బండి వెనక సైకిలు తొక్కుతుంటూ వొస్తున్నాడు. నన్ను చూసి చిరునవ్వు నవ్వితే, నేనూ నవ్వాను. అంతే, వెంటపడ్డాడు. ఈ మొగాళ్ళ కుక్కలు...."

"....చిక్క మొహం వెయ్యకు. నువ్వుకాములే పిచ్చిముండా...."

"ఏమిటి-కుక్కా, మొగవాడా? ఏది కాను నేను?"

"కుక్కే లేవే."

"సరేలే.... వాడు...." అన్నాను. ఆ 'వాడు' అనే వాడి మీద మండి పోతోంది గుండె.

"వాణ్ణి ఒక్క లెంపకాయ కొట్టాలనిపించింది."

"కొట్టావా లేదా?"

"విను ముందు. తరువాత నీ కోపం. షాపు గుమ్మానికి అడ్డంగా నుంచుని 'మరి ఆ వానిటీ కేస్ (Vanity case) కొనలేదేం?' అన్నాడు.

"పన్నెండు రూపాయలు చెపుతున్నాడు" అన్నాను, షాపువాడిపై అధికారేమో ననుకుని.

"రండి" అన్నాడు. షాపులోకి వెళ్ళా.

"ఈమె కేమి కావాలో ఇయ్యండి" అన్నాడు.

"ఆ Vanity case, ఈ దిండూ, హోల్డాల్ (Hold-all)ఒకటీ, ఆ పెద్ద పర్సూ, మొహమలు జోడు, అన్నీ తీసుకున్నాను. వొచ్చేస్తో వుంటే, నా వెంట తనూ నడుస్తున్నాడు."

ఒకటే నవ్వుతోంది. గలగలా మోగాయి గుర్రం మెళ్ళో మువ్వలు.

గుమ్మం దగ్గిర షాపువాడు 'బిల్ సార్' అన్నాడు.

" 'ఉ, ఉ, ఉ, ఇదుగో' అంటూ పర్సు తెరుస్తున్నాడు. నేను జట్కా ఎక్కి పక్కసందులోకి తోలించి తొరగా రైలు దగ్గిరికి ఒస్తున్నాను. కాని వెధవ సైకిలు కనపడుతోంది సందు చివర. ఇంతలో చంద్రశేఖరం కనపడి నమస్కారం చేశాడు, మోటారు స్టీరింగు చక్రం ఒదిలి గట్లలోకి జారడానికి సిద్ధమయింది కారు, బండిలోంచి మోటారులోకి దూకి సామాను లాక్కుని 'తొరగా వాయు వేగంతో పోవాలి' అని చెప్పే

లోపల ఆ లావువాడు ఒచ్చి మోటారు కిటికీలోంచి వెకిలిగా నవ్వుతో చూస్తున్నాడు. మోటారులో రైలు స్టేషన్‌కి ఒచ్చేశాను."

"వాడు ?"

"ఏమో? ఏమైనాడో? మొగాళ్ళు—ఈ మొగాళ్ళే -పందులు. నువ్వు కావులే."

"ఆ వస్తువులన్నీ యేవీ ?"

"ఆ చెప్పులా, శకుంతల అడిగితే యిచ్చేశాను. Hold-all చంద్ర శేఖరం కారులో మరచిపోయాను. Vanity case బద్దలైపోయింది, ఈ దిండే మిగిలింది."

"వాడు—ఆ లావాటివాడు పాపం !"

ఎంతైనా మొగవాణ్ని, మొగగుంపు మీద అభిమానం పోదు.

"కావలసిందే ఆడవాళ్ళని బాధించకుండా శాస్తి. ఇంక మాట్లాడించకు, నిద్ర ఒస్తోంది. ఆ చదువు చాలు—లైటు తీసేద్దూ."

వాన కురిసి అలిసిన మేఘాల్లోంచి జాలిగా చూస్తోంది చంద్రమామ మా వంక, మా పక్క దగ్గిరగా! నా వేపు వీపు తిప్పి కళ్లు మూసుకుని పడుకుంది. ఆమె మెడ మీదికి జారుతున్న ముడీ, చీర కుచ్చెళ్ళలోంచి కనపడే పాదాల వేళ్ళూ, శరత్కాలపు వెన్నెలా, నా ఒంటరి తనమూ, అన్నీ నా రక్తంలో పని చేస్తున్నాయి. అరుణ కాక యింకెవరన్నా కాకూడదా?

పది హేనేళ్ళ కిందట నన్ను ప్రేమించింది. ఆ పదీ రోజులూ—కాదు ఆ మూడు రోజులే. కాని అప్పుడైనా ప్రేమించిందా? ఏమో మరి. ప్రేమే అయితే పదిరోజుల్లో-నన్ను, చేతులు జాచి యేడుస్తోన్న నన్ను-పిల్లని మరిపించి చెరువుకి వెళ్ళే తల్లిలాగు నవ్వుస్తో వెళ్ళిపోతుందా? కాని పది రోజుల ప్రేమ అనేది వుండకూడదా? ఆజన్మాంతమూ అనే పురాణ

పవిత్రపదం పని చెయ్యడం మానదు కదా మనసుల్లో! నాకు కావలసినా అక్కర్లేకపోయినా నా కోసం కాచుకుని పడివుంటే అది ప్రేమా ? లేక పోతే....ప్రేమింపిందా? పూరికే ఆడుకుందా తన అవసరానికి... ? ప్రేమ అంటే యేమిటి? ఏ అవసరమైతేనేం, శారీరకం, మానసికం, హృదయికం ఏమిటా భేదం? ఏ అవసరమైతేనేం? ఇంకొకర్ని కోరడమేగా ప్రేమ! ఉపయోగించుకోవడమేగా ప్రేమ!....మనసు కల్పించుకున్న—

"ప్రేమ సౌధా కరిలే."

ఏది ప్రేమ? ఎవరిది ప్రేమ ? ఒక్కరాత్రి తృప్తిపడ్డ తరవాత, మళ్ళీ రక్త కణాలు వీర్యాన్ని సమకూర్చిందాకా, చచ్చిపోయేది ప్రేమా!! ఈ సమస్యతో కునుకు పడుతోంది.

"పిచ్చీ! పిచ్చి! నిద్రే?"

"వూ"

"ఏమిటి ఆలోచిస్తున్నావు దగ్గిరిగా వుండక ? నీ పక్క యేదీ తెచ్చుకో."

"నా పక్కా?"

"ఆ—నీకో పక్కకూడానా? ఇట్లా పడుకో."

"చెడు అలవాట్లు చెయ్యకు యీ దేహానికి"

"పోనీలే. కొంచెంసేపు యిట్లా కూచో.... నువ్వూ....నువ్వూ.... నా....ఏమిటోలే!" అని నా చేతిమీద వేళ్ళు వాయిస్తోంది, పక్కన కూచో పెట్టుకుని, ఆమె తల వెనక తలని ఆనించాను. ఆ పట్టు దిండు మీద విశ్వనాథ్ ఆయిల్ పరిమళాలు కదిలిస్తున్నాయి నా రక్తాన్ని. వెలవెలబోతో వాన కన్నీళ్ళతో చూస్తున్నాడు మా వంక కిటికీలోంచి చందమామ.

మెల్లిగా నవ్వుకుంటోంది, వెల్లకిలా పడుకుని ఆ తడి వెన్నెట్లో.

"ఏమిటి?"

"మనిద్దరం యిట్లా విడిగా పడుకున్నామంటే యీ అర్ధరాత్రి–యముడు నమ్ముతాడా? ఏం లేదని చిత్రగుప్తుడు సాక్ష్యం చెప్పినా సరే–లోకం మాట అటుంచి."

"మన పాత చిట్టా తిరగేసి చూస్తే—"

యముడు ఆ చిత్రగుప్తుణ్ణి, పాపం, ఒక్క కసురు కసురుతాడు, వీరేశలింగంగారు బాపయ్యగార్ని కసిరినట్టు. "నీకు బుద్ధి లేదు. ఇల్లాంటి వాళ్ళు విడిగా పడుకుంటారా? నీకు ముసలి చత్వారమా, లేక, లంచం తిన్నావా? అంటాడు."

"కాని నీ మొహం చూస్తే వాడెన్ని గుండెలతో—"

"ఆ రాత్రి మనం పడవలో— ఇట్లాంటి గుడ్డి వెన్నెట్లో—"

"ఆ చెక్క మనిద్దరికీ సరిపోదు. సన్నం– ఒకరి పక్కన ఒకరికి చోటులేదు. అందుకని...."

"ఇద్దరమూ ఒకవేపు చేరగానే, ఆ పడవ ముసిలమ్మలాగు వూగుతుంది, సణుగుతుంది."

"బ్రిడ్జి కిందినించి పోతూవుంటే పైన వాళ్ళు—"

"సిగ్గూ భయమూ వుండేవి కావు."

"ఈనాడు వున్నాయా?"

నా మొహం తన వేళ్ళతో మెల్లిగా తాకుతోంది.

అవును–మా మొదటి ఆకర్షణ.... అప్పుడు యెంత అందంగా కనిపించేది? ఆ బుజాలు చూసినా, రొమ్ము విశాలత్వం, ఆ కంఠం కింద మొదటి మెలిక చూసినా, రక్తం అణగక, చింపుకుని, ఎదురు తిరిగి,

చూపిర్ని ఆపేది. ఈనాడు ఆ అందం యామయింది? అట్లానే వుంది. ఇంకా స్థిమిత పడ్డది, కాని నా కళ్ళకి మాత్రం.... యేం జరిగింది? ఈనాడూ ఆమె వెనక ఆ లావాటివాళ్ళు.... ఆమె నడిచిన చోట్లనల్లా.... కాని నా పక్కన దిండుమీద మెరుస్తోన్న జుట్టుని పూరికే చూసి, ఉపమానాలు వెతుకుతానుగాని.... మునపటి మల్లే అట్లా వేళ్ళతో చిక్కు చేస్తో, మొహాని కద్దుకుంటో, గట్టిగా గుప్పెట్లలో పట్టి— మొహాన్ని దగ్గిరికి లాక్కోనుగదా— 'వెళ్ళిపోతా' నంటే, మొహం జుట్టులో దాచుకుని యాడవనుకదా! ఎందుకు? ఆశ్చంచరాలు లేక ఆమె చవక అయిందా? కాలేదు. ఎప్పుడో యిట్లా సుందర స్వప్నంవలె వాలి యెగిరి పోతుంది. ఆమె తరవాత నేను ప్రేమించిన వాళ్ళు— ఈమె అందం ముందు దీగ తుడుపుకి— ఈనాడు లిల్లీ యిట్లా పక్కన వుంటే- యిట్లా శాంతంగా పండుకుంటానా? కాని లిల్లీ అందం, బట్టలు తీసేస్తేగాని కనపడదు— ఆమెని వుద్రేకింప చేస్తేనేగాని బైటపడదు. ఈమె ముందు యెందుకు ఆ లిలీ ?

కాని—మనసు—ఇదంతా మనసు కల్పిస్తున్న ఇంద్రజాలం— కారణాలు ఎవరికి తెలుసు? దేవుడికా, సైకో ఎనాలిసిస్టులకా? ప్రేమ ఎట్లా వొచ్చింది? ఎట్లా పోయింది? శరీర సౌందర్యమా? గుణాలా? ఏమీ ఆకర్షిస్తాయి! ఇక్కడ సౌందర్యమూ, గుణాలూ, అన్నీ అట్లానే వున్నాయి. ఆకర్షణ మాయమయింది. నాకేనా? నా వంటి దుర్మార్గులకేనా? తక్కిన నా పతివ్రత సోదరులకి మనసు స్వాధీనంలో వుంటుందా? ఆ సందేహాలు చిన్నతనంలోనే పోయినాయి. ఈ నీతిపరులు ఎన్ని కబుర్లు, అబద్ధాలు చెప్పి నన్ను మోసగించలేరు. అవును— ఆకర్షణ వాళ్ళకి పోదు. అసలు వుంటేగా పోవడానికి? లావాటి లందలు- లద్దె పురుగులు, బక్కనక్కలు, రాకాసులు- నలుగుల దిబ్బలు.

అట్లాంటి భార్యలమీద ఏ ఆకర్షణాలేక- పై రొమాన్సులకి జడిసి యీర్ష్యతో కుళ్ళి, తమ మనసుల్నీ, ప్రజల్నీ, సమాధాన పెట్టుకోడానికి— "శరీర సౌందర్యం ఏముంది? నాలుగు రోజుల్లో నశిస్తుంది. గుణం ప్రధానం!!" అని విమర్శించుకుంటో తిరుగుతారు. గుణం? ఏమిటా గుణం? దెబ్బలకి జడిసి వొంట వొండే గుణం-గతిలేక, దిక్కులేక, ఇంటి దూలాన్ని పట్టుకుని వేళ్ళాడే నిర్జీవగుణం, నగలు, చీరలు, మోసేగాడిద గుణం. ఇవి వీళ్ళు మురిసి బోర్ల పడే గుణాలు! గుణాలు చూసి మోహించే టంత అసహజ జీవులు అసలు వున్నారా ఈ లోకంలో!

ఏమైపోయింది. మా ఇద్దరి మధ్యా ఆ విపరీత ఆకర్షణ! ఆ రోజుల్లో, చిన్నతనంలో— నాలుగేళ్ళ క్రితంనించి, ఆ మొదటి ముద్దు వెన్నెల రాత్రినించి, ఆమె కోసం తపస్సు చేశాను. బతిమాలాను. కోపగించాను, ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించాను. రాత్రులకు రాత్రులు ఆ నరాల బాధ పడలేక చంపుదామా, రేప్ చేద్దామా అని ప్రయత్నించాను. ఆ స్కాఫింగ్ హార్ట్‌లెస్ స్మైల్ (Scoffing heartless smile) భరించలేక, గుడ్లు పీకేద్దామా, కళ్ళు కాల్చేద్దామా అనిపించేది. అదృష్టవం తుల దగ్గర నుంచని ప్రేమగా మాట్లాడుతోందని తోచి డైనమైట్‌తో ముక్కలుగా ఎగరకొట్టాలను కున్నాను మళ్ళీ ఆమె దయగల చిరునవ్వుని పొంది ఒకటే కలలు కన్నాను, మళ్ళీ నిరాశలు పడ్డాను. ఆమె చేతులు నన్ను కావిలించుకోడం, ఆమె కళ్ళు నా కళ్ళలోకి ప్రేమతో చూడడం— తలుచుకు తలుచుకు కుమిలిపోయాను. ఆమెకి తెలుసు నా దాస్యం. పనులు చేయించుకుంది. ఇతరులకి చాకిరీ చేయించింది. తిప్పింది వెర్రివాణ్ణి చేసి, వీధి వీధులు, తన కొంగుకి కట్టుకుని. ఒక్క చల్లని చూపు, ఒక్క ముద్దు పేరు, ఒక్క కృతజ్ఞతా పలుకు, ఒక్క కరస్పర్శనం— ఇంతే బహుమానాలు నాకు దక్కినవి. అవి మరింత చీల్చాయి నన్ను. ఎంత

తోసేసుకున్నా ఆనాటి వెన్నెల రాత్రి ముద్దు మరుపుకు రాదు. ఏదో మప్పు చల్లినట్లు— ఏదో రాక్షసి పూనినట్టు- కోపగించాను. మరిచిపోవాలని. పూరిపైట, నిర్జన గృహంలో దాక్కున్నాను. ప్రయత్నించాను, చదివాను, తాగాను, ఉత్తరాలు రాసింది— విప్పకుండా పంపేశాను. కబుర్లు పంపింది- ఆ పేరు ఎత్తొద్దన్నాను— ఆశలు చూపింది- హేళనగా నవ్వింది- నీ. లెఖ్ఖేమిటంది? కాని ఒక్క సాయంత్రం వొచ్చింది.

"రాహూ"

అప్పుడు నన్ను ఆ పేరుతో పిలిచేది.

"ఎందుకు వొచ్చావు."

"నిలువలేక."

"అబద్ధం- వెళ్ళు- వెళ్ళిపో—" గట్టిగా అరుస్తున్నాను.

పెదిమలతో నా నోటిని ఆపింది.

"నీ కోసం."

"మరి యీ రాత్రి.... యీ రాత్రే...."

"ఎంత కఠినులబ్బా మొగవాళ్లు.... చూద్దాంలే."

"వీల్లేదు-ప్రమాణం చెయ్యి."

"ఈ కళ్ళు...."

ఎంత మృదు హృదయులు ఆడవాళ్ళు— ప్రేమించినప్పుడు! తరువాత మా తీవ్ర శరీరాకర్షణ, ప్రహారమైన వాంఛలు, శమించని, దయతలచని కామం, ఒక్క నిమిషం ఒకర్ని ఒకరం విడవలేని అనురాగం....

"నా మీద ప్రేమేనా నీకు?" అని అడిగాను ఓనాటి రాత్రి నీళ్ళ మీద.

'ఇంకా సందేహమా? ఎంత కష్టమబ్బా ఈ మొగాళ్ళని నమ్మించడం? ఇంకా ఏం చేస్తే నమ్ముతావు?'

అవును. ఇంకా ఏం చెయ్యాలి నన్ను నమ్మించడానికి? దేవత– రాక్షసి- కామరూపిణి- ఎవరు ఏ విధంగా మోహించగలరో, అంత తీవ్రంగా, అంత రమ్యంగా, సంపూర్ణంగా, అంత వివిధాలుగా మోహించింది. ఏ స్త్రీనించి, పురుషుడు అంతకన్న కోరగలడు? కాని, యీ పశువు, యీ పురుషుడు, దేవతని, కిన్నెరని, కోయిలని, తనకి వొండి, తన కాళ్లు కడిగి, తలంటి నోసి, తన మనసు మళ్ళితే మళ్ళీ తాను నవ్వేందాకా, ఏడుస్తో కాచుకుని కూచోమంటాడు. దాన్నే పాతివ్రత్యమూ, ప్రేమా అంటాడు.

"మరి యిది వరకు-మొన్న రాత్రి వరకు-"

"ఎప్పుడూ ప్రేమించానోయి నిన్ను, లేకపోతే నిన్ను 'రాహూ' అని ఎందుకు పిలుస్తాను?"

సందర్భమేమో నాకు తెలీలేదు కాని—

"మరి, మరి....యెందుకు చూపలేదు-?"

"వాడు, ఆ పశువు, ఆ విశ్వనాథం వొప్పుకోలేదు."

విశ్వనాథం పశువా? పాపం వొడిలిపోయిన పువ్వు జ్ఞాపకం వొచ్చేది నాకు అతన్ని చూసినప్పుడల్లా-ఆ చిరునవ్వు తప్ప.

"మరి ప్రేమిస్తే...."

"నీ కర్థం కాదులే, వూరుకో."

"మరి అతన్ని ప్రేమించావా, లేదా? ఆ విశ్వనాథాన్ని."

"ఏం ప్రేమలే?"

"ప్రేమించకపోతే...."

"అబ్బా! ప్రేమ, ప్రేమ! ప్రేమించాలెప్పా, పోనీ ఎందుకీ గోల! నీ చేతుల్లో పడున్నాను యిప్పుడు, చాలదూ....ఈ దినాలు, ఈ నిమి

షాలు-పూర్వం నేనేమైతేనేం? ఇకముందు ఏం కాబోతేనేం? ఇది చాలదూ? ఛీ, యీ మొగాళ్ళు!" చప్పున లేచింది నన్ను దులుపుకుని.

"ఏం చేశాను?"

"ఏం చేశాను అని అడుగుతున్నాడు. ఏం చేశావా? సుందరమైన కీర్తనలో....ఏం తాళం, రాగం? అని అడుగుకున్నావు? అనుభవించడం చేతగాక! 'ఇదివరకు ఏమైనావు! ఇక ఏమౌతావు?' ఎందుకవన్నీ! వెన్నెట్లో కూచుని 'చంద్రుడు అస్తమిస్తాడే-నిన్న ఉదయించలేదే' అని యేడ్చే నిర్భాగ్యుణ్ణి నిన్ను చూశానుగాని! స్త్రీ వొళ్ళో ఎన్నాళ్ళు కూచుంటుంది? చంద్రుడెంత సేపు వెలుగుతాడు? వెలిగితే....నిద్రపోతావు. అట్లానే నిలిస్తే యీ సౌందర్యం భరించగలవా-నాయనా?"

ఎంత వేదాంతం బోధించింది ఆ కొంచెం మాటల్లో. జన్మమంతా కృతజ్ఞుణ్ణి! కాని నా అరుణ....ఆనాడు నా చేతుల్లో, అంత కోర్కెతో నా నోటి మీద....వొప్పుకోను. నాది, అరుణ నాది....అంది హృదయం. నాడు మా ఆకర్షణ అంతా దుమ్ము అయిన తరువాత కూడా ఆ ఒడుపు, ఆ ఒయ్యారం, ఆ కృతజ్ఞతా, ముద్దు పేర్లు. ఎక్కడో, యెవరి చేతుల్లోనో, యెవరి కళ్ళల్లోనో, యెవరికో అని తలుసుకుంటో నా కళ్ళకర్లేని అందాన్ని కూడా యితరులకి దక్కడం సహించక బాధ పడుతున్నాను.

ఈ రాత్రి మళ్ళీ అరుణవంక చూశాను. షోల్డర్ బ్లేడ్స్ (Shoulder blades) ఒంపు, జుట్టూ వీపూ కలుసుకునే చోటి నునుపు, ఆ చేతివేళ్ళ కిందినించి ఆ పిరుదులు తీసుకొనే కర్వులు నా నరాల్ని లాగుతున్నాయి; నా ఆర్టిస్టు భావాలు బాధిస్తున్నాయి. లిల్లీ యీ చర్మపు మృదుత్వంతో పాటైన అందం కనపర్చగలదా? కాని లిల్లీ నాది, నా స్వంతం. యీ అరుణ? అపురూపంగా దొడ్లో నిమ్మ చెట్టుమీద రెండు నిమిషాలు వాలే అడివి పిట్ట! నిద్ర పడుతోంది గావును....

"పిచ్చి బాబులూ!"

నా వేపు తిరిగి నా రొమ్ము మీద మొహం పెట్టి గోముచేసి లేపుతోంది.

"ఊ" అంటో ఆమె మీద చెయ్యేసి పడుకున్నాను. నాకు మల్లేనే ఆమెకీ గతం కలలు వొచ్చి దయ కలిగింది కావును!

"కళ్ళు తెరు, నా వంక చూడు,"

ఎందుకు వొచ్చింది? నానించి ఏం కావాలి? మళ్ళీ జీవితం ఆమెని గాయం చేసిందా? లేక ప్రణయ మార్గంలో సోపానమా నేను ఆ రాత్రికి?

"ఒక సంగతి చెప్పడం మరిచి పోయినాను. నీతో."

కళ్ళు తెరిచాను. లేచి కూచుని దిండు నానుకుని నా చెంపల్ని పట్టుకు వూయిస్తోంది. ప్రేమా, ఆదరణా అంత చక్కగా చూపుతుంది అరుణ. నాకు నిద్రపోవాలని వుంది. కాని జన్మలో ఎన్నిసార్లు యిట్లా, యింత నాజూకుగా, వేళ్ళని చెంపల మీద వెయ్యకలవారు ఎందరున్నారు? ఈ అరుణనే ప్రేమించ గలిగితే! జీవితమే అంత-మనకి రాసి లేని అదృష్టం వొళ్ళో పడితేనేం గాక, అనుభవించగలమా!

"ఏమిటి?"

నా కళ్ళని పెదిమలతో తెరుస్తోంది. ఆమె వేళ్ళు వెన్నెముకకి చక్కలిగింతలు పెడుతున్నాయి. ఇంత రసికురాలు గనకనే, ఆమెనించి చిరునవ్వు పొందిన పురుష నిర్భాగ్యు లందరూ ఊర్వశి దర్శనం పొంది పోగొట్టుకున్నట్టు, అన్ని సుఖాలూ వొదులుకుని, ఆమెకోసం వెతుక్కుంటో తిరుగుతారు. తక్కినవారు జాడీలలో దాచుకున్న పీనిగ భార్యలు పతివ్రతలు కదా, అని సంతోషిస్తూ, అరుణవంటి స్త్రీలని తిట్టుకుంటో సుఖపడతారు.

"చూడు, రాత్రి నాకోసం యెవరన్నా వొస్తారేమో?"

"ఈ రాత్రి ! ఎందుకు వొస్తారు?"

"నీకు మతి మందగిస్తోంది. ఎందుకు రాకూడదూ? నీకోసం ఎవరన్నా రాకూడదూ? మనుష్యుల్ని చూడ్డానికి రారూ యెవరూ?"

"అర్ధరాత్రి యీ కొత్తవూర్లో నీ కోసం—"

"ఏమో రాకూడదా? వొస్తే—తలుపు కొట్టినా, పిలిచినా, మాట్లాడకు."

"ఏమీ?"

"నిద్ర అక్కర్లేదూ మనకి? ఎవరో వొకరు వచ్చి లేపుతో వుంటే నీకు తల నెప్పి రాదూ?"

"ఎట్లానూ లేపిం తరవాత—"

"మాట్లాడక నిద్రపో. నిద్ర లేకపోతే తలనెప్పి వస్తుంది. ఇట్లా పడుకో. అని నా ముఖాన్ని తనకి ఒత్తుకుని మాట్లాడనీకండా చేసింది. చందనపు వాసనల్లో మైమరిచాను. కాని మనసు పూర్తిగా నిద్రపోలేదు. ఇట్లానే ఆ రాత్రి హోటలు గదిలో—చంపక పూలతో అలంకరించాము. ఆ పచ్చని కౌయ్యమంచమంతా. అర్ధరాత్రి మెలకువ వచ్చి లేవబోతే, నన్నూ కదలనీక, మాట్లాడనీక అట్లానే ఆ మృదుప్రదేశాల మధ్య నా మొహాన్ని అదుముకుంది. కాని ఆనాడు కూడా మనసు నిద్రపోలేదు. ఎన్నాళ్ళ ఎన్నేళ్ళ తపించాను ఆ రాత్రి కోసం? అంత లేదని ఎన్ని కోపాలు! అందితే-ఎన్నికలలు! కాని ఆ రాత్రి అంత సుందరమైన అనుభవమూ—చివరికి యింతేనా? ఇంకేం చెయ్యను. తరవాత— ఈ అంద మంతా నా చేతుల్లోనే వుంది. కాని అప్పుడు నిరుపయోగం....ఇంతకన్న యే వుపయోగమూ లేదా? చివరికి అంత రసికత్వమూ, నేర్పూ, శరీర సౌందర్యం, చిరునవ్వులూ, నేత్రాల్లోంచి అల్లరి చూపులూ అన్నీ చివరికి

యిట్లా యీ అలసటలో అంతమా? అన్నేళ్ళు కోరిన ఆమె చేతుల మధ్యనించి కొంచెం తప్పుకుని దూరంగా పడుకోవాలనిపించింది. ఆమెకి కష్టం కలుగుతుందా? ఈ సఫలమైన ఆనందం కన్న, ఆ తీరని వేదన యెక్కువ వాంఛనీయమేమో! ఏ సుఖకష్టాలనే అలలమీద యీ ప్రపంచం వూగుతోందో, ఆ సుఖ దుఃఖ భేదం....నిజంగా ఆ బేదం వుందా? ఆనందం దొరకగానే, ఎన్నేళ్ళోపడ్డ బాధంతా వడస్టే తోస్తుంది. కాని ఆ ఆనందం యిట్లా వేళ్ళలోంచి జారి—యింకే ముంది బాధ కాక అనిపిస్తుంది. ఆ రాత్రి—ఆ అపూర్వపు రాత్రి—ఆమె తెల్లారి వెళ్ళిపోతుందే, తక్కిన రాత్రినంతాకూడా మాధుర్యంతో నింపగల శక్తి యీ నరాలకి లేకపోయిందే అని యీఃఖించడంలో గడిచింది.

"వెళ్ళవొద్దు. నువ్వు నా నించి వెళ్ళవొద్దు" అని ఆ రాత్రి ఆమె బుజాన్ని గట్టిగా పట్టుకున్నాను. కాని వేళ్ళలో ఆ అగ్ని చల్లారిందని ఆమెకి మాత్రం తెలీటంలేదా? కొంచెం నేపటి కింద, గడ్డంకింద, పిరుదలమీద, వొళ్ళంతా తాకిన చోటనల్లా ఝల్లుమనిపించిన నా వేళ్ళు!

"ఎళ్ళను—పడుకో."

"నిజమా?"

"మరి బండిని రమ్మన్నావే! పెల్రిగ్రాం యిచ్చావే!"

"ఆ సమస్యలన్నీ నీ కెందుకు—పడుకో."

"మరి ఎప్పుడూ-నా దగ్గిరే—"

"ఎప్పుడూ ముసలివాళ్ళమై కళ్ళూ కాళ్ళూ లేనప్పుడు కూడా నీ దగ్గిరే!"

ఈ తాపమూ, ఏ తాపమూ, కలలూ లేకండా తమ కామశేషాన్ని అపుర్చుకునేందుకు సాధనం ఏదో వొకదాన్ని భార్యగా అట్టిపెట్టుకుని

శాంతంగా, నిద్రపోయే వాళ్ళే జ్ఞానులేమో! అనుకుంటో నిద్రపోయినాను యీ రాత్రి.

ఎవరో తలుపు కొడుతున్నారు నిజంగానే? "ఎవరది" అని అరిచాను.

అరుణ నా నోరు మూసింది.

"మాట్లాడకు—ఏం చెప్పాను?"

తలుపు కొడుతున్నారు.

అరుణ నా పక్కన బోర్లపడుకుని నవ్వుతోంది.

కింద వాడెవడో పిలుస్తున్నాడు.

జుట్టులోంచి పరిమళాలు, కంఠంలోంచి నవ్వులు, పొడుగాటి వేళ్ళ నిప్పు కణికలవలె నా నోటిమీద. ఆమె మెడ వెనక వెన్నెట్లో మెరిసే మంచి ముత్యాల్ని జుట్టులోంచి చిక్కుతీస్తో వారి కేకల్ని నిర్లక్ష్యం చెయ్యాలని ప్రయత్నిస్తున్నాను.

పొరుగువాళ్ళు లేచి ప్రశ్నిస్తున్నారు.

"వెళ్ళి చూస్తాను."

"వీల్లేదు."

లేవకుండా దగ్గిరగా పట్టుకుంది. ఏం చెయ్యగలను? మొగవాణ్ణి! అబలుణ్ణి! ఆమె చేతిని, నా చంప కానించుకుని వేళ్ల లెక్కపెడుతున్నాను. ఒచ్చినవాడు మొండి శిఖండి "ఇదేం అన్యాయం తలుపు తెరవ"రని అందర్నీ ప్రశ్నలడుగుతున్నాడు. విశ్రమించి మళ్ళీ నా పాత తలుపుమీద భీకర సమరం ప్రారంభించాడు.

"తలుపు బద్దలవుతుందేమో?"

"బద్దలు కానీ."

"ఏం లాభం? ఎట్లానూ లోపలికి వస్తాడు—అప్పుడు?"

మాట్లాడకండా నా వేపు తిరిగి,

"ఆ రాత్రి—వాడ బంగాళాలో, భూమి బద్దలైనా, దేవత లెగిరి ఒచ్చినా నన్ను విడవనన్నావు, జ్ఞాపకం వుందా?" అని నోటితో, కస్తూరి పరిమళాలు చల్లే నోటితో, ఆ చిన్న పళ్ళవరసతో నా నోరు మూసింది.

నేను అన్నీ మరిచి వూరుకున్నాను.

కాశ్మీరపు కుంకుమ తోటలమీద వాయుస్పర్శ ఆమె బాహువుల ఆలింగనం – మోహం వుండనీ నాకు, లేకపోనీ.

"నా మర్యాద! తెల్లారి పొరుగువారి ప్రశ్నలు" అని దూరంగా విస్పర్ (Whisper) చేస్తోంది మనసు. జుట్టు, చేతులు నున్నని బరువు చంపమీద, హిమాలయ శిఖరాలు, గోదావరీ సైకత స్థలాలు, నందన వన పుష్ప పరిమళాలు. బృందావనంలో వెన్నెల రాత్రులు – అన్నీ యెన్నో, కలల్లోనో, నిజంగానో....ఒళ్ళు తెలీదు.

తెల్లవారి దాసీది తలుపుకొడితే మెలుకువ ఒచ్చింది. మూసుకున్న కళ్ళతోనే, కిందికి వెళ్ళి గడియ తీసి, పైకి ఒచ్చి పడుకున్నాను. ఎర్రని ఉదయ కాంతితో తామరపువ్వు మధ్య పసిడిబొమ్మవలె చెక్కు చెదరక నిద్రలో, యేపాప మెరుగని చిన్న పిల్లవలె చిరునవ్వులు నవ్వే అరుణ నా పక్కన. కాని అరుణకన్న సన్నిహితంగా నిద్రాదేవి కావిలించుకుంది.

ఎందుకు తెరిచాను కళ్ళని? కాని కారణం కనపడదు. కారణం వుందీ, కాని వుందని ఎట్లా తెలుస్తుంది? నల్లనివాడు, జిల్లేడుపూల కళ్ళ వాడు, తెల్లని సూటువాడు, యింట్లో కూడా హాట్ పెట్టుకుని వెనక దాగిన

వాడు నుంచుని చూస్తున్నాడు, కిటికీలోంచి మా యిద్దరివంకా — వులికి పడ్డాను.

"ఎవరు?"

మాట్లాడడు, గుడ్లురిమి చూస్తాడు.

కోపం వచ్చింది నాకు.

"ఏమిటది? ఎందుకు పైకి వొచ్చావు?"

అరుణ మెల్లిగా కళ్ళు విప్పింది. ఆ వుదయాన అప్పుడే పక్క మీద నించి లక్ష్మి సముద్రం లోంచి లేచి వొచ్చినట్లు, అంత శుభ్రంగా ఏమీ చెదరకుండా కనపడ్డది. కొందరు వరం పొంది పుడతారు— ఏ అవస్థ లోనైనా బట్టలు వుండీ, బట్టలు లేకా, నవ్వులో, యేడుపులో, మురికిలో, షోకులో, కోపంలో, మోహంలో యెప్పుడూ ఆకర్షకంగా ఉండేందుకు. అద్దం దగ్గిరికి వెళ్ళి—తెలుసుననుకుంటా—చూడకండానే వొచ్చినవాడెవడో— అతను తనకి కనపడేటట్టు అద్దం తిప్పి, కళ్ళుమూసి, నాలిక బైట పెట్టి వెక్కిరించింది. కల కంటున్నానా యింకా?

"కాఫీ అయిందా?" అని అడిగింది నన్ను.

రాత్రి తలుపు కొట్టినవాడు—నిద్రలేని ఎర్రబిల్లేడు కళ్ళు — వాడే వీడు నాలుగు అడుగులు నడిచి తలుపు తోసుకుని లోపలికి వొచ్చి అరుణ చెయ్యి పట్టుకుని లాక్కుని పోతున్నాడు. అరుణ మెడ తిప్పి నా వంక చూసి నవ్వింది.

"చూడు. అతను....వుండు, బీస్టు!"

బీస్టు! వీడి ముద్దు పేరా? సరిపోయింది.

"చీరె సరిగా కట్టుకోనీ కొత్తవాళ్ళు మేడమీదికి వస్తే పిచ్చి తండ్రికి యిష్టం వుండదు. కింద కూచో, మొహం కడుక్కుని వొస్తాను."

అని కిందికి తీసుకుపోయింది, ఆ తెల్ల సూటుని. చక చకా నా గది అంతా సర్దుతోంది. నేను వెనక పంపు దగ్గిర్నించి తిరిగి వొచ్చేటప్పటికి. టీ సగం తయారయింది అప్పుడే.

"వెళ్ళాడా?"

"కింద కూచున్నాడు. గుడ్ల గూబ, బీస్టు."

"అదేమిటి?"

"అదేదోలే, మిక్సెడ్ క్రీచర్ (Mixed creature)"

"అది టీ తాగుతుందా, ఆ మిక్సెడ్ క్రీచర్? లేక ఏదన్నా కాఫీ, గంజీ మిక్చర్ తాగుతుందా?"

"మాగ్, సల్ఫ్, అండ్ క్వినైన్ మిక్చర్ (Mag-Salph & Quinine mixture) తాగుతుంది.

అరుణ కొన్నాళ్ళు నర్సు పని చేసిందట.

కాని రెండు కప్పుల 'టీ' కిందికి తీసుకుపోయింది.

వాడెవడో, ఏమిటో, అరుణని అడిగి లాభంలేదు. కానీ,

ఇంక కొంచెం వ్యవధి దొరికిందికదా అని నేను అన్సర్ పేపరు కట్టలుతీసి, మార్కులు చాలా పిసినారిగా పంచుతున్నాను; నా సొమ్ము తరుగుతున్నట్టు. అరగంటలో కింద గోల. కేకలు. పరిగెత్తాను. చూశాను. బీస్టు అరుస్తోంది. అరుణ అలమారు మీద చెయ్యేసి నుంచుని, తనను కానట్టు చిరునవ్వుతో చూస్తోంది—నన్ను చూసి నాకంతా తెలిసినట్టే—

"చూడు తనతో నట-నేనిప్పుడుట—ప్రయాణం కావాలిట. ఇంత దూరం ఒచ్చి నాకేమీ 'రెస్టు' అక్కర్లేదూ? అదీగాక...."

ఎంతకాలం గడిచినా, ఒకసారి గొప్పగా ప్రేమించిన స్త్రీ యింకోరి మోహాధీనంలో చూడగానే జెలసీ తలెత్తక మానదు.

"అదిగాక అమీరుద్దీనుని కూడా రమ్మంటిని, ఆయన యామను కుంటారు. పాపం, నేను లేకపోతే?"

అమీరుద్దీనెవరు? వీడెవడు? వాళ్ళందరూ యిక్కడికి యెందుకు ఒస్తారు? రమ్మనడానికి, ఆమెకి యిట్లా అనడానికీ వీడికీ ఏం అధికారం వుంది? ఈ ప్రశ్నల నన్నిటినీ లోపలికి నెట్టి.

"ఎందుకండీ! ఇష్టపడని ఆమెని బలవంతం చేస్తారు?" అన్నాను. వేదాంతమూ, నాగరికతా, అహింసాతత్వం మనని ఆ గతికి తెచ్చాయి. మరి వాడు—అంత ఆశ్చర్యకరమైన, అన్యాయమైన విషయం యెన్నడూ విననట్టు యెర్రని కళ్ళు పెద్దవిచేసి, బుసలు కొట్టుకుంటో — ఇంగ్లీషులో—"ఇష్టంలేదూ—నా మీద...." అని—

చూడండి యీ వికృతం అన్నట్టు చుట్టూ చూశాడు.

"ఇష్టం లేదూ? ఆ మాట అనమనండి."

నేను తిరిగి అరుణ వంక చూసేటప్పటికి పిక్చర్ (Picture) మారింది. ఆ ఇండిఫిరెన్స్ (indifference) అంతా పోయి, ఆమె కళ్ళ వెంబడి నీరు చంపల మీద నిండి భుజంమీద పడుతున్నాయి. పోతన్నగారి సరస్వతి కన్నీళ్ళు వేరే డెస్టినేషన్ చూసుకున్నాయి గాని, యీ నాటి స్త్రీల కన్నీళ్ళు పమిట మీదపడి, జాకెట్టులో యింకిపోతాయి. చిందడం నేను చూడలేదు. వింత వింత కన్నీళ్ళ 'డెస్టినీలు' వున్న 'భారతి' అట్టమీద భారతులు యేడిస్తే చెప్పలేను. చిందవేమో, ఆ భారతులకు రెవికలు చీరెలూ తీసేశాను. ఎన్ని తీసినా ఆ 'భా' మాత్రం తియ్యరు కదా!

"లేకపోతే, మొన్నరాత్రి—" అనబోతోంది వాళ్ల తెలీక బీస్ట్.

అరుణ ముఖం మారింది. కళ్ళు నిప్పులు కక్కుతున్నాయి. నీళ్ళలో నిప్పులు వెలగడం చూశాను నేనప్పుడు!

"ఏమిటి? మతి పోయిందా నీకు, వైల్ బీస్ట్ (Vile Beast)?"

అంత పెద్ద బీస్టు నిలువునా ఒణికింది, హీనస్వరం పడ్డది.

"నేను పోను, నేను పోలేను, పొమ్మనకండి. వెళ్ళి నేనేం కాను?"

"మరి గోల చెయ్యకు. పిచ్చి నాన్నకి గోల అంటే పడదు." అని ఒచ్చి నన్నానుకుని, నా చెయ్యితీసి తన నడుం చుట్టూ పెట్టుకుంది. బీస్టు నాలిక తెరిచి నెమ్మదిగా పడుకుంది.

అరుణ తలమీద దువ్వడం ఒక్కటే మిగిలింది.

వాన వెలిసింది కదా అని పైకిపోయి పేపర్ల కట్టలో తల దూర్చాను. తొమ్మిది దాటింది. భోజనం హోటల్నించి ఒచ్చింది. అన్నం తనకి మిగలదని. కోపంతో, నరసమ్మ గిన్నెల్ని యిటూ అటూ విసిరి కొడుతోంది. అరుణ ఒచ్చింది, తలలో కొత్త చమేలీ పువ్వులతో సహా.

"బీస్టు ఇక్కడే తింటుందా ? అన్నమేనా ఇంకేమన్నా తింటుందా?"

"తింటుంది."

"మరి స్నానం యిట్లాంటివి అవసరం లేదా?"

"ఏమో మాటలు రావు."

"అరుపులు తప్ప."

"కొంటె!"

"భోజనం దగ్గిర అంతా స్నేహం రాజ్యం చేసింది. కబుర్లు, నవ్వులు, కామం కళ్ళు కప్పని నిమిషాల 'బీస్టు' చాలా చమత్కారి. ఎన్టర్ టెయినర్ (entertainer) వుద్యోగరీత్యా ఫారెస్టు ఆఫీసర్.

వన్య మృగమన్న మాట. ఇంగ్లండ్ రిటర్న్డ్ (England returned). ఆ దేశంలో స్త్రీల సంగతీ, అమెరికా నీగ్రోల కథలూ చెప్పి నవ్వించింది. వాళ్ళ పాటలు పాడి నాట్యం కూడా చేస్తుందిట ఆ డాన్సింగ్ బేర్.

నవ్వుతో బడికి వెళ్ళాను.

మధ్యాహ్నం ఒంటిగంటకి యింటికి ఒచ్చేప్పటికి అప్పుడే మూడో రంగం మీద తెర యెత్తారు. మేడ మీద కొత్త కంఠాలూ, గోలా వినపడుతోంది. ఒక మహమ్మదీయుడు, పెద్ద షేర్వాణీ, నల్లని గడ్డం. చక్కని మెరిసే ఛాయా, సన్నని ఒళ్లూ, కుర్చీలో కూచుని ఇంకో కుర్చీ మీద కాళ్ళు పైకి పెట్టి, చుట్ట చుట్టుకొని కూచున్న వాడు శాస్త్రి నన్ను చూసి మెల్లిగా పడగ విప్పి లేచి, కోరలు కనపరుస్తో, రెండు చేతులూ జోడించాడు.

"మాస్టరు సాబ్!"

అరుణనీ, బీస్టునీ చూపిస్తో, దీనత్వంతో, కోపంతో, జాలిగా, అధికారంతో అన్ని రసాలూ ఒలికేట్టు సుమేర్‌సింగువలె హిందీలో లెక్చర్ కొడుతున్నాడు నిరర్గళంగా. నేను యింగ్లీషు పాశుపతంతో ఆ ప్రవాహాన్ని ఆపి కుశల ప్రశ్నలు ప్రారంభించాను. నాకు హిందీ మాట్లాడడం ఎంత చాతవునో, ఆయనకి యింగ్లీషు అంతమాత్రమే తెలుసు. ఈయన పరుషా, ట్రంకూ తెచ్చుకున్నాడు. ఆయన నైజాములో యింజనీరట. "ఈ బీస్టు యెవరు? నీ యింట్లో యేం చేస్తోంది? ఇట్లాంటి బీస్టుని ఎందుకు చేరనిచ్చావు? అంటాడు. వాడు నా పెట్ బీస్టు అయినట్టు. ఈ అన్యాయం విచారించరా మీరు, మీ పవిత్రపు పురానా యింట్లో యెందుకు వున్నాడు? వీడికేం హక్కు వుంది? వెళ్ళ కొట్టండి ఇంకా చూస్తారేం? అంటాడు నన్ను. ఆయన పేరు అమీరుద్దీను. అది అసలు పేరా ముద్దుపేరా అనుకుంటో వుండగానే, ఇంతసేపూ పాపం 'పిచ్చిముండ'కి ఎంత కష్ట

మొచ్చిందా, (తనకేం సంబంధం లేనట్టు) యెట్లా తప్పించనా అన్నట్టు జాలిగా చూస్తున్న అరుణ.

"నాగన్ మీరు తొందరపడకండి. నేను రేపు నిజామాబాదు, ఒస్తున్నానుగా, మీరు సాయంత్రం రైల్లో వెళ్ళండి," అంటోంది.

నేను పక్క గదిలోకి వెళ్ళి టీ చేయడానికి స్టవ్ వెలిగిస్తున్నాను. అరుణ లోపలికి వచ్చి ఈ బుజంమీద తల ఆనించి యేడ్చింది.

"ఏమిటీ కష్టం నాకు? లోకం-ఈ వెధవ లంచరూ-నన్నెట్లా యేడి పిస్తున్నారో!" అంటో.

పాపం-అరుణ అధైర్య పడిపోయింది. ఒక చెయ్యి స్టౌ మంటకి అడ్డంపెట్టి రెండో చేత్తో ఆమె వీపు తడుతున్నాను' కొత్త పసుపుపచ్చ చీనా సిల్కు చీర మీద.

"ఈ బాధలన్నీ నువ్వే తెచ్చి పెట్టుకున్నావు కద!" అని అనడా నికి గుండెలేదు: గుండెరాదు. అందాన్ని హర్టు చెయ్యలేను. ఆ సంగతి అందానికీ తెలుసు. అందుకనే అందాలు నన్నిట్లా ఆటలు పట్టిస్తాయి. అదిగాక, అంత నిస్సహాయంగా, నన్ను నమ్మి కన్సొలేషన్ (conso-lation) కోసం నా దరిచేరిన పిల్లని, పూర్వం ఒకప్పుడు నన్ను అంతగా ప్రేమించిన పిల్లని ఎట్లా నిందించను? జీవితంలో ఏమీ శక్తి లేకండా ఇంత నలిగిపోయే పిల్లని-ఎంత దుర్మార్గులు యీ పురుషులు!

టీ, బిస్కట్లూ వాళ్ళ ముందు పెట్టి రెండు గుక్కలు తాగాను. వాళ్ళ చూపులతో ఆ కప్పులలో టీ సల సల మంటోంది. ఇంకేం తుపాను మళ్ళీ ప్రారంభమౌతుందోనని కోటు వేసుకున్నాను.

"వెళ్ళొద్దు, అప్పుడే!" అంది చెయ్యి పట్టుకుని, సరిగా వేదవల్లి లాగు. వేదవల్లి, అంత చిన్న పిల్లా, నన్ను మీటింగులో ఒక్కమాటతో,

రెండు చిన్న వేళ్లతో, ఒక పక్క చూపుతో నన్నాపడం తలుచుకుంటో నుంచున్నాను.

"అరుణా, మనం సికింద్రాబాద్‌లో గార్డెన్సు దగ్గిర విన్న బాండు ప్లేటు కొన్నాను. నువ్వు విని తీరాలి—" అంటున్నాడు గడ్డమ్ము.

ఆలస్యమైతే హెడ్మాస్టరు పెట్టే ప్లేటు జ్ఞాపకం వొచ్చి కదిలాను, చక్కని చేతులు గుమ్మానికి అడ్డంగా చాచి "వెళ్ళడానికి వీల్లేదు. ఎట్లా వెడతావు?" అంది అరుణ చిరునవ్వుతో. ఆ గదినీ వాళ్ళ మొహాల్నీ వెన్నెల అందాలతో కప్పుతో. బైట నించి ఎండ ఆమెపై చేతుల మీద పడి మెరుస్తోంది.

"వెళ్ళకపోతే, ఉద్యోగం పోతుంది, పోతే, వీళ్ళిద్దరూ వీధిలో పోట్లాడుకోవలసి వొస్తుంది, ఇల్లుండదు" అంటో బుగ్గ మీద కొట్టి; ఆమె చేతినెత్తి నా బుజంమీద ఆనించుకుని, ముద్దు పెట్టుకుని పరిగెత్తి ఓల్డ్ హార్స్ (old horse) మీద దూకాను.

వుండ గలుగుదును. నా మీద అధికార్లు నోట్ చేసుకున్న రిపోర్టుల్లో ఇది వొకటి. కాని ఆమె కన్నీళ్ళు, వాళ్ళ తగాదాలు, ఆమె అసహాయత్వం, నా నిస్సహాయత్వం భరించలేను.

సాయంత్రం వొచ్చేటప్పటికి, లోకంతో పాటు నా యిల్లూ చల్ల బడ్డది. చీట్లాడుతున్నారు ముగ్గురూ—ఆ చింత చెట్టుకింద కుర్చీ లేసుకుని. నా గ్రామఫోను మోగుతోంది. నా సిగరెట్ టిన్ను బోసినోరేసుకుని నన్ను చూసి యేడ్చింది. అరుణ నా వంక చూడనే లేదు. అమీరుద్దీన్ వెంటనే లేచి, పక్క కుర్చీలోకూచోపెట్టాడు నన్ను.

"రండి, రండి" అని నాకు కూడా ముక్కలు పంచబోతున్నాడు. చేతులోంచి 'హేండ్' కిందపారేసి. మర్యాదలో మహమ్మదీయుల్ని మించిన వాళ్ళు లేరు. తలుచుకుంటే అమర్యాదలో కూడా!

'యానిమల్ ఇన్స్టింక్ట్స్' ఎంత 'రిఫైన్' కావాలో అంత రిఫైన్ ఐనాయి వాళ్ళలో. ఎంత 'రూడ్'గా వుంటాయో చూడాలన్నా వాళ్ళలోనే చూడాలి. కాని ఆ ఇన్స్టింక్ట్స్ని (రిఫైన్ ఆర్ రూడ్) మించిన వాళ్ళు స్వల్పం వాళ్ళలో.

మర్యాదలోనే కాదు, అనుభవంలో కూడా. అనుభవించడం— పంచేంద్రియాలతో—ఒక పర్పస్‌లాగు, డ్యూటీ లాగు చూసుకుంటారు.

గొప్ప ఆధ్యాత్మికొంచలాల్ని అందుకున్న సూఫీ వేదాంతులూ, కవులూ కూడా, ఆ ఈశ్వరుణ్ణి తమ ఆనందానుభవానికి ఆభరణంగా చేసుకున్నారా! అనిపిస్తుంది.

"పిచ్చిగాడికి పేక యిష్టంలేదు." అంది అరుణ.

"ఏం?" అంది బీస్ట్.

"నాకు జ్వరమూ, చారూ, డయాఫ్రెటిక్ మిక్శ్చర్ జ్ఞాపకం వొస్తాయి" అని ముక్కలు పట్టుకున్నాను.

"అయినా టీ తాగంది యింకో పని చెయ్యడు" అని తప్పించాలని చూసింది పాపం అరుణ. నాకు పేకాట యెంత యిబ్బందో తెలుసు ఆమెకి.

"నాది 'డమ్మీ హాండ్' నేను స్టౌ వెలిగిస్తాను." అన్నాడు సాయబు.

"ఐనా సాయింత్రం తప్ప కథలు రాసుకోడానికి వ్యవధిలేదు, పిచ్చి తండ్రికి."

"కథలు రాస్తారా మీరు మాస్టర్ సాబ్? ఈసారి నన్ను కథలో చిత్రించి తీరాలి మీరు, నన్నూ అరుణనీ, నా సంగతంతా రాత్రి చెపుతాగా?"

ఎందుకు అరుణ నన్ను ఒదిలించుకోవాలని చూస్తోంది?

లిల్లీ వొచ్చింది.

ఇందుకా పాపం, నా కోసమా, ఈ ప్రయత్నమంతా, అరుణా! ఇంతే కద లోకంలో? స్వార్థ రహితంగా మనుష్యులు కొందరు వుండగల రని నమ్మడం ఎంత కష్టం?

చప్పున అరుణ లేచి లిల్లీని కావిలించుకుంది. లిల్లీ కళ్ళు నా మీద కన్నా అరుణ పసుపు చీనాసిల్కు చీరెమీద వున్నాయి. బల్లమీద పుస్తకాలు పడేసి, "టీ ఏదీ?" అంది.

"కాస్తున్నాడు."

"ఎవరు?"

"నా గన్"

"నా గన్???"

నా గన్ బైటికి వొచ్చాడు. నల్ల గడ్డమూ అతనూ. లిల్లీని చూడటంతోటే,

"హల్లో! సో గ్లాడ్." అంటో వొచ్చి షేకండు యిచ్చి యెగాదిగా చూస్తున్నాడు.

"ఏమిటి?" అన్నట్లు నా వంక చూసింది లిల్లీ.

"నా గన్ అంతేలే. ఆయనకి కొత్తలేదు." అంది అరుణ.

"సామాన్లు లోపల పెట్టించారా? టీ సిద్ధమవుతోంది. ఒక్క నిమిషం. ఈ లోపల విశ్రాంతి తీసుకోండి" అని లిల్లీతో అంటో లోపలికి పరిగెత్తాడు నాగన్.

'సామాన్లేమిటి?"

"నువ్వా వీళ్ళమల్లేనే రైలు దిగి వొచ్చావనుకుంటున్నారు ఆయన."

నాగన్ యింతలో బైటికి పరుగెత్తుకు వొచ్చి, "ముక్కలు కొంచెం ఆడి పెట్టండి. వెయ్యి సలాములు" అంటూ లిల్లీ చేతిని వూయించి పోయినాడు.

లిల్లీ ఆశ్చర్యంతో నా వంక చూసింది. "మానెర్‌లెస్ రాస్కెల్! కరుకు తురక" అని, "యింకా వాణ్ణి యింట్లో వుంచాలా, యింకా యిట్లాంటి ఉపద్రవాలు సంభవిస్తాయి, మీ యిష్టం" అన్నట్టు నా వంక చూశాడు బీస్టు.

ఆట అయేటప్పటికి టీ కప్పులు వొచ్చాయి. అరుణ సిగరెట్ వెలిగించింది. ఒక సిగరెట్ తన స్వంతది (చార్‌మీనార్) తీసి లిల్లీ నోట్లో పెట్టాడు అమీరుద్దీన్. లిల్లీ అసహ్యించుకుంది. సిగరెట్‌నా, తననా అని ఆలోచిస్తున్నాడు గావును అతను.

"స్నానం చేద్దుగాని రా" అని లిల్లీ చెయ్యి పట్టుకుని నవ్వుతో మేడమీదికి పరిగెత్తి తలుపు వేశాను.

అద్దం ముందుకి వెళ్ళింది లిల్లీ. లోకం ఎంత తల్లకిందులైనా మనుషులు మామూలు అలవాట్లు మానరు.

"ఎందుకు మళ్ళీ ముడి యిట్లా వేశావు?" అంటూ పిన్నులన్నీ లాగేశాను.

"మార్చబోతోవుంటేనే తొందర! మీ కిష్టమైనట్టు ఆ వదులుముడి వేసుకు పోతోవుంటే వెక్కిరించారు బోళ్ళో! మీకేం మొగవాళ్ళు!"

"మార్చకు వదిలెయ్యి, వెళ్ళేప్పుడు మర్యాదగా కట్టుకుందు గానిలే."

కిందినించి సాయేబు పెద్ద నవ్వు గోడల్ని కదలిస్తోంది.

"యీవాళ...."

"ఏం?"

"ఏమిటో, నేను వెడతాను."

"ఏమిటి లిల్లీ! ఏమన్నా జరిగిందా?"

"వాళ్ళెవరు?" అంది కంఠం ఒణుకుతో.

"ఎవరో అరుణ యెరిగిన వాళ్ళు."

"ఎందుకు వాళ్ళు?"

"వెళ్ళిపోతారులే. మనకెందుకు?"

షెమ్మీతో భయపడుతో నుంచుని వుంది లిల్లీ!

"ఎవరో ఒస్తున్నారు" అని చప్పున చీరె నందుకుంది.

"వాళ్ళని మరిచిపో" అని కళ్ళనించి వాళ్ళని తుడిచేశాను.

"ఇంకెవరన్నా ఆ గదిలో దాక్కున్నారేమో" అని బెదురుతో చూస్తోంది చుట్టూ; షెమ్మీ వదలక. కూచోపెట్టి కబుర్లు చెప్పాను పాతాల సంగతి మాట్లాడాను. సముదాయించాను. చీరెని బుజాల చుట్టూ కప్పి నవ్వించి మురిపించాను. ఒళ్ళంతా పౌడరు వేశాను. షెమ్మీ వదలదు.

"ఎప్పుడు వెళ్ళిపోతారు?"

"నాకేం తెలుసు!

"రేపు."

ఆడవాళ్ళ దగ్గిర అనెస్టీ ఈజ్ వర్స్టు పాలిసీ. కాని ఏం చేసినా షెమ్మీ వదలదు. కిందికి ఒచ్చేటప్పటికి చీకటయింది.

"అయిదా?" అన్నాడు బీస్టు.

నాకు ఒళ్ళు మండింది. మాట్లాడలేదు.

"పాఠం, జాగ్రఫీ పాఠం, చెప్పడం అయిందా అని అడుగుతున్నా డాయన!" అంది తెలివిగల అరుణ.

లిల్లీ కూచుంది.

"రాత్రికి ఫీస్ట్" అని చప్పట్లు కొట్టింది అరుణ.

"అప్పుడే ఆర్డర్లు వెళ్ళాయి." అన్నాడు బీస్టు.

"తమరు తప్పకుండా మా ఆహ్వానాన్ని అంగీకరించాలి" గొప్ప మర్యాదగా చేతులు జాచి హిందీలో అన్నాడు నాగన్ లిల్లీ ని.

"ఏమిటి?"

"నిన్ను రాత్రి భోజనానికి వుండిపొమ్మంటున్నాడు."

"వీల్లేదు వెళ్ళాలి, ఆజ్ఞ" అంది లిల్లి.

అమీరుద్దీన్ నా వంక చూశాడు.

ఈ భాషాంతరీకరణం ఒకటి నా మెడను చుట్టుకుంది.

"ఎవరు?" అన్నాడు నాగన్, చంపేట్టు చూస్తో.

"భర్త"

"ఎక్కడ వున్నాడు?" అంటో బీస్టు వృథాగా షర్టు చేతుల్ని మోచేతుల మీదికి లాగింది.

"ఆమెని రోజుకి రెండు గంటలు మాత్రం ట్యూషన్ కోసం ఇక్కడకి రానిస్తాడు భర్త! మా పిచ్చిబాబుని చూస్తే భర్తలకి అమితమైన విశ్వాసం" అంది అరుణ.

"అవును. ఆయన ముఖంలోనే తెలుస్తోంది ఆ గొప్పతనం" అన్నాడు నాగన్.

నవ్వుకుంటున్నాడా ఆ గడ్డంలో!

"పిచ్చిముండతో పోటీవస్తారా, పాటి మొగవాళ్లు!" అంది ఆమె హిందీలో.

అరుణ సహాయ నిరాకరణోద్యమంలో పని చేసింది. జెయిలుకు మాత్రం వెళ్ళలేదు. తెలివిగా తప్పించుకుంది అంటారు కిట్టనివాళ్ళు. అంతే గాక యింటోంచి తప్పించుకుని, స్వేచ్ఛగా తిరగడానికి మంచి వంక దొరికింది అంటుంది పాడు లోకం! కాని, అదంతా స్వేచ్ఛా సమరమేకదా, స్వేచ్ఛని వాంఛించించని తప్పుపట్టడ మెందుకు అని ఆశ్చర్యపడతాను నేను. ఐనా హృదయం దేశభక్తితో నిండిం తరువాత వేరు అనురాగాలకి స్థలమెక్కడ వుంటుంది? పూజ్యులైన వాళ్ళను యీర్ష్యవల్ల తూలనాడు కోవడంగాని! ఏవో ఫొటోలూ, బీచి షికార్లూ అంటారు. వయసు మళ్లిన పూజ్యుల విషయం కూడా, ఇంక అరుణని లక్ష్యం చేస్తారా, దుర్మార్గులు!

లిల్లీతో రహస్య సంభాషణ ప్రారంభించాడు. బీస్టు. ఆ చర్మాల రంగు ఏకత్వమేనా, లేక అవును—లిల్లీ వింత మృగంగా మారుతుంది. అదే ఆమెలో ముఖ్యమైన ఆకర్షణ! రక్తం పీలుస్తుందా, ఆ కళ్ళలోంచి నిప్పు చినుకులు మీద రాలతాయా? ఆ నరాల బాధతో, మెలికలతో వేళ్ళ తీవ్రమైన పట్టులో ప్రాణం పోతుందా అనిపిస్తుంది. ఒక్కొక్క స్త్రీ రతీ దేవినించి ఒక్కొక్క వరం పొంది పుడుతుంది. కాని అరుణ మాత్రం పది వరాలు తెచ్చుకుంది.

ఏదో నమ్మి భర్త పంపిస్తున్నాడని చెప్పినా బుద్ధిలేక ఆ టిమాయకు రాల్ని తిప్పలు పెడతాడేమిటి? బీస్టు!! అని కోపమొచ్చింది నాకు. అరుణ వ్యవహారాలు అరుణవి. కానీ పాపం పిచ్చి లిల్లీ బాధ్యత నాదీ. భర్తే యేమంటాడు తెలిస్తే?

లిల్లీ ని లెమ్మని తీసికెళ్ళాను యింటి దాకా. రోడ్డుమీద ఎవరూ లేనప్పుడు లిల్లీ నా పక్కకి తిరిగి—

"వాళ్ళని పంపెయ్యండి" అంటోంది ప్రతిసారీ. లిల్లీ నా ప్రక్కన నడవదు. తను ముందు పోతుంది. నేను వెనకాల ఏమీ సంబంధం లేనట్టు నడవాలి. ఆమెకి యే అపాయమూ కలగకుండా చూస్తో! మరి ప్రేమకి బద్ధుణి! ఏమీ విష్ణుమూర్తి భక్తికి కట్టుబడతాడు కదా! భక్తులకి దాసుడుకద! ప్రేమకీ భక్తికీ అట్టే దూరంలేదు భక్తిని తప్పించుకోలేక ఆయన చేసిన నీచత్వాని కన్నానా!

లిల్లీ వెనక రాత్రి రోడ్డుమీద నడవడం చాలా సరదా నాకు. ప్రతి ఎలక్ట్రిక్ దీపం కిందా వెలుతురు ఆమె జుట్టులో మెరుగుపూలు కల్పించడం, ఆమె నడక వొయ్యారం,ఆమె నీడ పెద్దదీ చిన్నదీకావడం, ఆమె జాకెట్ కింద ఆ నిటారు వీపు మీద బుజాల వెమికలు కదలడం, ఆ సాయంత్రపు అనుభవాలు జ్ఞాపకాలు రావడం, వొంటరిది ఆడది నడుస్తోందని ఆమె వంక దొంగ చూపులూ, వెనక చూపులూ, ఆశల చూపులూ చూసేవాళ్ళని నాకు సంబంధం లేనట్టు చూడ్డం. నా రహస్య అదృష్టానికీ, వాళ్ళకి దక్కని దానికి సంతోషించడం—ఇన్నీ.

తిరిగి యింటికి వొచ్చి రోడ్డు మీద ఆగాను. ఇల్లంతా చీకటి. శబ్దంలేదు. లోపలికి వెళ్ళాలని బుద్ధి వెయ్యలేదు. పగలంతా నిద్రపోయిన భూతాలు రాత్రి కాగానే లేచి తిరుగుతున్నట్టున్నాయి. మొదటి నించీ ఆ పాడుబడ్డ పెద్ద యింట్లో దెయ్యాలున్నాయని నా నమ్మకం కూడానూ.

ఇంటో దీపంలేదు. వరండాలోంచి చీకట్లో తడుముకుంటో గది లోపల మెట్లదగ్గిరికి వెళ్ళానో లేదో అరుణ తటాలున యెదురుగా వొచ్చి నన్ను కావిలించుకుంది. నా రొమ్ముకి యెదురుగా ఆమె గట్టిరొమ్ము

ఆవేశంతో లేచి పడుతోంది. నాకు ప్రభుత్వంవారు పర్మిషను యిస్తే ఈ కథమాని తక్కిన పేజీలన్నీ ఆమె వక్షాన్ని గురించి నింపేద్దును.

ఎందుకు? ఈమె ఖేదానికి కారణం యేమిటి? - మెల్లిగా చప్పుడు కాకుండా ఏడుస్తోంది. స్నానం చేసింది గావును. ఇంకా చెమ్మ నా బుగ్గలకి తగులుతోంది. నా మంచి గంధం సబ్బు పరిమళాలు - కొత్తగా వుతికిన చీరని చల్లని చాకిరేవు తావులు. వాళ్ళిద్దరూ ఒకర్ని ఒకరు నరుక్కుని చావలేదు కద!

"వాళ్ళేరీ ?"

వాళ్ళ సంగతే తనకు పట్టనట్టు.

"ఎక్కడికో చచ్చారు. మళ్ళీ వొస్తారు భోజనానికి!" అని విసుక్కుంది.

ఆమె అంత దగ్గిరగా నుంచోడం యీ రాత్రి నాకు కలవరం పుట్టిస్తోంది. ఆ చీకట్లో ఆమె నాకు చనువైన అరుణగాక, యెవరో కొత్త స్త్రీవలె తోస్తోంది. నా వేళ్ళు ఆమె మెడ కింది సున్నితత్వానికి మూర్ఛలు పోతున్నాయి.

ఈ రాత్రికి వాళ్ళిద్దరూ అట్లానే పోకూడదా?

"నేను నీ దగ్గిరే వుండిపోతాను. ఈ గోలలన్నీ పడలేను."

"ఉండిపో." ఈసారి 'సిన్‌సియర్ డిజైర్'తో అన్నాను ఆ మాట. "కాని వుండవు."

"మరి లిల్లీ!"

ఏదో తాను వుంటే, లిల్లీకి తాను అడ్డమో, తనకి లిల్లీ అడ్డమో ఐనట్టు.

(4)

"నీకు తెలీంది ఏముంది? చిన్న పిల్లమల్లే ప్రారికే ప్రశ్నలు వేస్తావు గాని!" అన్నాను.

"ఎందుకు వుండనూ?"

అని నన్ను అడుగుతోంది.

"ఒక్కొక్కరం ఒక్కొక్క పిచ్చితో పుడతాం. ఎంత ప్రయత్నించనీ తప్పించుకోలేము. తప్పించుకున్నాం, తప్పించుకుంటున్నాం, తప్పించుకోగలం అనుకుంటాం అంతే."

"అవునులే, కాని నీతో వుండిపోతే, ఎంత శాంతంగా వుంటుంది?"

ఆమె జీవితమే అంత! ఎప్పుడూ, శాంతి, శాంతి అని శాంతిమీద కోర్కె కాని శాంతిని ఒక నిముషం భరించలేదు.

ఎక్సైట్‌మెంట్ కోసం శాపం పొంది పుట్టింది.

నా చెంపలు రాస్తోంది.

ఎంత బావున్నాయి ఆ నిమిషాలు!!

"ఎందుకు సరిగా క్షవరం చేసుకోవు?"

"ఆ మాట అడిగేవారు లేక!"

"ఛా!"

తమాషా ఆడవాళ్ళ హృదయం - ఇంతైనా యింకా ఆ పిచ్చి లిల్లీ ఆమె హృదయానికి ముల్లుగానే వుంది - రెండేళ్ళకోసారి యెక్కణ్ణించో వూడిపడే అరుణకి — నా మీద యేమీ ప్రత్యేకం, గొప్ప ఆకర్షణలేని అరుణకి!

"లిల్లీకి నా చెంపలు అంత ముఖ్యం కావు."

"ఏమి?"

"ఏదో నే ననే వ్యామోహంలో యివన్నీ చూడదనుకుంటాను."

"చూడకేం? చేతులకే యింత గరుకుగా వుంటే పాపం!"

నవ్వింది-చిన్నగా, సిగ్గుతో, కొండల మీద గొర్రెల మెళ్ళో గంటలు టింగు మన్నాయి.

"అప్పుడు—పూర్వం-చంపలు ఎంత మెత్తగా వుండేవి! ఇంకా మీసాలు కూడా రాలేదు."

"అదీ జ్ఞాపకం వుందీ!"

"అయినా మెత్తని చిన్న వెంట్రుకలు తగిలిన చోటల్లా చక్కలిగిలి పెట్టి తిమ్మిరెక్కించేవి."

ఏమిటిది కావలిసే మాట్లాడుతోందా? మెల్లిగా ఆమె వేళ్ళు నా బుజాలకిందా, నా వెన్నెముకకీ చాలా నేర్పుగా నరాల్ని నొక్కుతున్నాయి కావలిసేనా? ఏదైనా పర్పస్ వుందా? కాదు, ఆమెకి -ఆమెవలె చాతుర్యం గల స్త్రీకి—అదంతా సహజం — కోయిలకి మధురమైన కంఠంవలె, కోతికి గంతుల వలె.

కాని నాలోనించి ఎప్పుడో పోయిన ఆకర్షణల్ని మేలు కొలుపుతున్నాయి ఆమె వేళ్ళు, ఆ రాత్రి.

ఎక్కడో రోడ్డు మీద దీపపు మెత్తని ఇన్‌డైరెక్ట్ కాంతి కొంచెంగా ఆమె జుట్టుమీద మాత్రం పడుతోంది. ఒకడు 'క్రైమా వడలో' అని కేక వేస్తున్నాడు. ఇద్దరమూ అట్లా నుంచున్నాము. ఒకర్ని ఒకరం వొదలలేక-ఏం కావాలో పూర్తిగా తెలీక-తెలిస్తే ఒకరి కొకరం సంకెళ్ళ మవుతామనే భయంతో - కామంతో నరుపుల మీద మండిపోవడం కన్న ఎంత మధురాలు అట్లాంటి నిముషాలు?

* * *

భోజనాలు డాబా మీద యేర్పాటు చేశారు. రెండు పళ్ళాలనిండా చంపకపూలు తెచ్చారు. ఆ చంపక పువ్వు మల్లే మార్స్ సముద్రంపైన మెరుస్తోంది. బీస్ట్ ఆ పాడు సూటు పారేసి తెల్లని లాల్చీ వేసుకుని శుభ్రంగా కనపడుతున్నాడు. నేను విస్తళ్ళని భక్ష్యాలతో అలంకరిస్తున్నాను. ఈ లోపల నాగన్ అరుణని చీకటి చెట్ల కొమ్మల్లో మిణుగురు పురుగుల మధ్యకి తీసుకుపోయి యేమేమిటో మాట్లాడుతున్నాడు. బీస్టు నాకందివ్వడం లోనూ, పిట్ట గోడనించి కిందికి ఆదుర్దాగా వాళ్ళ వంక తొంగి చూడడం లోనూ, నా వంక "మీరు వుండి కూడా ఇంత ఉపేక్ష చేస్తారేం?" అన్నట్టు చూడటంతోనూ, కాలు కాలిన పిల్లి మల్లే అన్నీ వొలక తన్నేటట్టున్నాడు.

"వర్దన అయిందర్రోయ్! గణ, గణ గణా." అన్నాను బీస్టు అవస్థ చూడలేక.

చల్ల గాలి వీస్తోంది. దూరంగా కిందీ నించి జట్కాల చప్పుడూ మాదాకవళం అరుపులు వినపడుతున్నాయి. విస్తళ్ళు జిలేబీలతో, బకాళా భాతు గిన్నెలతో, ఆలూ పలావ్ బలువులతో తేజరిల్లుతున్నాయి. చంపక పువ్వుల పరిమళం మత్తెక్కిస్తోంది.

"వాడు, ఆ తరకవాడు పరమద్రోహి, మిస్టర్! పాపం ఆ అమాయకురాలు అరుణ తన గొప్ప హృదయంతో అనుమానించక యెట్లాగో పొరబాటున వాణ్ని నమ్మి స్నేహం చేసింది. వాడా? నమ్మిన వాళ్ళని నాశనం చేసే మహనీయుడు. మీరన్నా కొంచెం వార్నింగ్ ఇవ్వండి."

చిన్న పిల్లలంత పిచ్చివాళ్ళు మొగవాళ్ళు— స్త్రీల విషయంలో.

కాని నా అవస్థ కూడా అట్లానే వుంది— ఆ మహమ్మదీయ సోదరుడు అరుణని చీకట్లో మనాపలైజ్ చేసుకోడం. ఎందుకు ఈ స్నేహాలన్నీ అరుణకి? ఆ మాత్రం మత సాంప్రదాయాలన్నా యోచించ కూడదా?

ఈ కథ చదివే వాళ్ళ హిందూ హృదయాలకి ఎంత బాధగా వుంటుందో చూడకూడదా? నాకూ బీస్టుకి వున్నంత బాధా వుంది. కాని లోపలే అణుచు కున్నాను. మన ఇన్‌స్టింక్ట్సు చేసే అడావిడి బైటికి కనబడకుండా ప్రయత్నించడమే నాగరికతకి ప్రథమ లక్షణం! అందమైన స్త్రీ పోతూవుంటే ఒకడు బూతు మాట బిగ్గరిగా అన్నాడు. ఇంకొకడు లోపల కోరుకుని కను కొలికిలోంచి చూసి, తల వొంచుకుని పోయినాడు. ప్రథముడికి రౌడీ అని దుర్నామమూ, ద్వితీయుడికి చాలా సత్పురుషుడూ, అన్యకాంత లద్దంబైన మాతృభావం చూపే అభినవ ప్రహ్లాదుడని ఖ్యాతీ.

అయినా నా మనస్సులో మాత్రం వీడిట్లా నా ముందు యాదవక పోతే వెళ్ళరాదా. ఆ సాహేబు గడ్డం పట్టుకుని వూయించి, అరుణని మెడ పట్టుకుని లాక్కు రారాదా? నాకు ధైర్యం లేని పని, నేను ఏ పని చెయ్యడానికి సిగ్గుపడతానో ఆ పని యీ బీస్టు చెయ్యరాదా అనిపిస్తోంది.

"మీ ఉద్దేశ్యమేమిటి చెప్పండి? ఈ గోలలన్నీ ఐపోయిం తరవాత అరుణ నాతో వొస్తుందంటారా?"

"వొస్తానని చెప్పిందా?"

"ఇదేమిటీ? ఈ మాత్రం తెలీదా నాకు" అన్నట్టు చూశాడు.

"రాక? ఎన్నిసార్లు చెప్పింది? నన్నే ప్రేమించిందండీ, నాలో ఏమీ గొప్పలేదా? అయినా—"

చాలా గొప్ప వుంది అంటానని కొంచెం ఆగాడు.

"మరి ఎట్లా ప్రేమించిందో నన్ను, నేను లేకండా బతకలేదు."

"అరుణ సంగతి మీకేం తెలుసు?" అన్నాను అతనిమీద జాలిపడి.

"తెలీకేం?"

ఆలోచించాడు.

"తెలీదు లెండి. కాని ఆమె హృదయం సంగతి నాకు తెలుసు. వీడెవడో దెయ్యంలాగు పట్టి ఆమెని బాధిస్తున్నాడు. గాని వీడే లేక పోతేనా?"

మాటలతో తన అదృష్టం వర్ణించలేని వాడివలె నవ్వాడు.

సృష్టి ఆదిగా స్త్రీలో పురుషుడి విశ్వాసాన్ని, ఆ విశ్వాస ఫలితాన్ని లక్షల మాట్లు చూసిన నక్షత్రాలు ఆకాశమంతా ఫక్కున నవ్వాయి.

ఇంకా మాట్లాడదామా, కొంచెం కళ్ళు తెరుద్దామా అనిపించింది నాకు. వలలో చిక్కుకున్న అడివి దున్నవలె తన్నుకునే ఆ మనిషిమీద జాలేసి. కాని చాలా సంస్కారం వున్న మనుషులే, ఎంతో విచక్షణతో జీవితాన్ని చూడగల మేధావంతులే, మానవ స్వభావాన్ని స్టడీ చేసిన పండితులే— స్త్రీ వ్యామోహంలో కాలు జారేప్పటికి, కళ్ళు కనపడక, గొలుసు విప్పేవాడి చెయ్యి కరిచే కుక్కల్లాగు వర్తిస్తారు. ఏం లాభం అని వూరుకున్నాను.

"చూడండి, ఏమిటి యిల్లాంటివి వొప్పుకుంటారు. ఏం మర్యాద! అట్టా వొంటరిగా చెట్ల కిందికి తీసుకుపోతాడు! స్నేహమైతే నలుగురిలో స్నేహం? ఆమె యే మెరుగును, అతనెంత దుర్మార్గుడో? అసలు ఆయన సంగతి మనకేం తెలుసు చెప్పండి—"

ఏం చెప్పను? నవ్వనా? అతని బాధని చూసి విచారించనా?

మాదాకవళంవాడు మా గుమ్మం ముందుకి వొచ్చాడు.

"భోజనాలు కాలేదు, పో!" అంటోంది నరసమ్మ.

ఎవరో కొందరు తిండిలేక మాడుతున్నారనే అంతర్ ధ్యాస వుంటేనేగాని, వాళ్ళకి లేక మనకి వున్నాయికదా అని చూసుకుంటేనే గాని, ఆనందించలేము గావును, అదీ భోజనంలో కూడా. ఆ రాత్రి వాళ్ళిద్దరూ తెచ్చిన వాటిల్లో మిగిలేవి, నలుగురు బిచ్చగాళ్ళు తినవొచ్చు.

వేస్టు! ఎంత వేస్టు! లోకంలో!

మాకు పదార్థాలు వృథా, అతనికి ఆకలి వృథా! ఏ కాస్త లోపం ఎప్పుడు కలుగుతుందోనని, ఎంత ఎక్కువగా తయారు చేసుకుంటారు, కూడబెట్టు కుంటారు? స్త్రీని అంతే! ధనాన్ని అంతే! భోజనాన్నీ అంతే!

నాగన్, అరుణా, యిద్దరూ మెల్లిగా వొచ్చి చివరిమెట్టు దగ్గిర మళ్ళీ ఆగారు. మా గాస్‌లైట్ కాంతి వాళ్ళ పదముల వరకు పడుతోంది, ఫోటగ్రాఫరు వేసిన లైటువలె. బీస్టు ఫోటగ్రాఫరేమిటి తన ప్రాణమే వాళ్ళ మీద నిలిపినట్టు చూస్తున్నాడు కళ్ళు కిందినించి, కాని వాళ్ళిద్దరూ ఇది గుర్తించలేదు నాగన్‌కి సరే, అరుణ కూడా యితర ప్రపంచం మరిచినట్టుంది. అతన్నీ, అతని పునుగు పరిమళాన్నీ, ఠీవిని, భాషలో గంభీరాన్ని అన్నిటినీ తాగుతున్నట్టున్నాయి ఆమె కళ్ళు. నాకు తెలుసు అదేమీ ఇన్‌సిన్‌సెరిటీ కాదని, సౌందర్యాన్ని చూస్తే హృదయాన్నిచ్చేస్తుంది, హృదయంతోపాటు ఇంకేమిస్తుందా అని సందేహం. దూకడానికి పురికించే వింతమృగం లాగు పొంచాడు బీస్టు. ఎట్లా గడుస్తుందబ్బా యీ రాత్రి! చివరికి వొచ్చి కూచున్నారు. ప్రారంభించారు భోజనం. ఒక్కరూ మాట్లాడరు. వాళ్ళిద్దరూ, ఒకరికొకరే కాని, మేమిద్దరం లేనట్టే, బీస్టు గోంగూర పచ్చడి కారంతో కాదు, తన లోపల్నించి వొచ్చే పొగలతో వాగరుస్తున్నాడు. నేను కొంత అదుర్దా, కొంత భోజనపు రుచీ, కొంచెం లిల్లీ లేన్ని

కోరతా, కాని చాలావరకు, అరుణ, నా దగ్గిరిగా, నా వంక చూస్తూ కూచో లేదనే దిగులూ. ఏమిటదీ యీ రాత్రి నాకు కూడా. ఎందుకూ?

గాలిలో "టెన్‌షన్" ఎక్కువయింది.

ఒక్కరికి— చాలా రుచులుగల ఫీస్టుని అరగిస్తున్నామో— చెత్త తింటున్నామో భేదం తెలీదనుకుంటా— అరుణ సంగతి చెప్పలేము గానీ? పది రూపాయల ఖర్చు. అర్ధణా యెత్తు ఆనందం కలగలేదు ఒక్కరికీ. ఆ మధూకరం వాడు తిండిలేక యింకా అరుస్తున్నాడు వీధి చివర.

విచిత్రం జీవితపు విలువలు!

భోజనం కాగానే అరుణ చివాలున లేచి లోపలికి వెళ్ళింది. అదే మొగవాళ్ళు చేస్తే తప్పు. కాని, ఆడవాళ్ళని ఏమీ అనడానికి వీలులేదు. మొగవాళ్ళు తెలుసుకోలేని అవసరాలు, దేహ, మానసిక, ఆత్మావసరాలు ఎన్నో వుంటాయనే మిస్టరీలో యిల్లాంటి చిక్కు సమయాల్ని సులభంగా దాటారు ఆడవాళ్ళు— అనాది నించి. వెంటనే అందుకోసమే కాచుకుని వున్నట్టు, నాగన్ నన్ను చెయ్యి పట్టుకుని దూరంగా తీసుకుపోయినాడు. ఎంగిలి విస్తట్ను బీస్ట్ వొకటే ఐనట్టు.

"భాయీ!"

ఆ బీస్ట్ ఆ సాయేబు నేనా, లేక యీ రెండో అయన్ని కూడా యీ రాత్రే తినెయ్యనా అన్నట్లు చూస్తోంది.

"భాయీ, అరుణకి నా మీద శాశ్వతమైన అద్భుతమైన ప్రేమ వున్నదంటారా? మీ ఉద్దేశ్యమేమిటి?"

ఈ సాయేబులకి అభమూ, శుభమూ ఏమీ తెలీదు.

"ఇష్టం లాగే వుంది."

"మరి వాడు?"

"వాడా! వుత్త బీస్ట్. వాడికేం తెలీదు, వాడు—శుద్ధ పొరబాటు."

"వీడు కాదయ్యా!"

"రైల్లో ఆమెతో దిగాడు, ఆ బ్రాహ్మడు."

"బ్రాహ్మడా—యెవరా బ్రాహ్మడు?"

"యెవరైతే నాకేం? ఎందుకా బాధ?"

సాయేబు లేడు, నా ముందు. వీస్టు వున్నట్టుండి లోపలికి పోతున్నాడు. అతని వెనక తొరగా సాయేబు కూడా మాయమైనాడు. విరహంతో, పెరుగు అలుకుళ్ళతో గాసు లైటుకింద మరీ తెల్లగా మెరిసే విస్తళ్ళకేసి చూస్తున్నాను. ఒక్కణ్ణి. చిత్రమైన రాత్రి అది!

బ్రహ్మడా? ఆ బ్రాహ్మ డెవడు?

అరే-సిగరెట్లూ, తాంబూలాలూ ఏవీ? బుట్టలో వుండిపోయినాయి గావును. కిందికి వెళ్ళి చీకట్లో వుత్త బుట్టలు వెతికాను, లేవు. కిళ్ళీకొట్టుకు పోయి కొనుక్కుని పైకి వొచ్చేటప్పటికి ముగ్గురూ కులాసాగా కబుర్లుచెప్పుకుంటో తిరుగుతున్నారు. కులాసాగానేనా? ఎందుకంటే నావంక చూసి కూడా యెవరూ నన్ను పిలవలేదు. సిగరెట్టుమీద నా కసినంతా చూపుతో నా బాధా ధూమాల్ని ఆకాశంవేపు వెదజిమ్ముతున్నాను నేను.

నాకే గనక ఆమెవంక చూసినప్పుడల్లా, ఆమె నవ్వూ, ఆమె నడక పిరుదుల వూపూ చూసినప్పుడల్లా, గుండెల్లో కలుక్కుమనకపోతే, వాళ్ళ గోలలు, వాళ్ళ తాపాలు, చూపులు, అరుణ అందం, రాత్రి శాంతం, ఎంత ఎన్‌జాయ్ చేసివుందును? కోర్కె అనేది తలెత్తగానే 'నాకు' అనే అగ్గి అంటుకోగానే, అంతా బాధ తీగెలతో కీళ్ళను అల్లుకుంటుంది. యీ లోకం-ఏమీ అక్కర్లేకుండా లోకాన్ని చూడడం చాలా గొప్ప అనుభవం గావును! నాటకాన్ని చూసినట్టు—మనకేం సంబంధం లేదనే సబ్ కాన్షస్నెస్‌తో.

"ఏమిటీ అట్లా చీకట్లలో దాక్కుంటున్నావు?"

చప్పున తలెత్తాను.

అరుణ పిలుస్తోంది నన్ను. వేదాంతం చెదిరిపోయింది. కీర్తీలు, సిగరెట్లు, పువ్వులు, ఆటలు, పాటలు, ముగ్గుర్నీ కలిపి నవ్వించడం, ఇష్టంగా ఆహ్వానించడం, బెదిరించడం—రెండు గంటలసేపు అన్నీ వైరాలూ మరిచి, సర్కసు మృగాలవలె ఆమె చుట్టూ ఆడాము. ఏమయింది వైరాగ్యం? ఆమె కన్నెత్తి చూడకపోతే విరాగం, చూస్తే రాగం, చాలా వైరాగ్యాలు ఇంతే.

ఆ రాత్రి ఎక్కణ్నించి తెచ్చుకుంది లోకంలో ఆ గొప్ప ఆకర్షణ - ఆ కడపటి రాత్రి? అదంతా నా మనసు మార్పువల్ల ఆకర్షణని భావించుకున్నానా, లేక నిజంగా ఆమె యేమన్నా-జన్మానికంతా ఆఖరు దినమని ఏ దేవతల్నో ప్రార్థించి వరం తెచ్చుకుందా? ఆ నిమిషాన నవ్వే ఆమె వంక చూస్తే, ఆమె కళ్ళనీ, రొమ్మునించి పొట్టమీదికీ, పర్వతం స్పృశించి కిందికి జారే నదివలెపడే పమిటనీ చూస్తే చిందులు తొక్కే కుచ్చెళ్ళ వెనక పాదాల్నీ చూస్తే జన్మమంతా ఈమె హస్తాల బిగువులో. ఆ నవ్వు పెదిమ తళ తళలో, ఆ నల్లకళ్ళ నీడల్లోకాక, వేరే యింకో ధ్యాసలో బతకడం యెంత మూర్ఖమూ అనిపించింది. ఆ రాత్రి ఆమె నాకు కావాలి-అని నిశ్చయం యేర్పడ్డది. నిన్న రాత్రంతా నన్ను చూస్తో, నా పక్కనే గడిపింది. నేను అప్పుడు ఆమె వేపు చూడనన్నా లేదు, ఏ మొచ్చింది నాకు? ఏ పొరలు కమ్మాయి నా కళ్ళని? ఏ దెయ్యం నా మనసుని పట్టింది?—ఆమెని అన్ని గంటలు—ఈ అందాన్నంతా ఉపేక్షచేస్తో పడుకునేందుకు నిన్న అనుకున్నాను.

విలువల్ని మనసే కల్పిస్తోంది. మనకి కావాలని కోర్కె పుట్టిం దాకా ఎంత విలువైన పదార్థమైతేనేం మనకేం గొప్ప!

ఒక్క నిమిషం విడిగా చిక్కితే! కాని నా కోర్కె తెలుసునేమో, చిక్కదు!

"రహస్యం."

అన్ని యెన్నిసార్లు పిలిచినా, పకపక నవ్వే.

"నీ రహస్యాలు తెలుసులే" అని గంతులేస్తోంది.

చివరికి డెస్పరేట్ ఐ, ఓ మూల అందుకుంపే తీరా చెవి యిచ్చి నేను చెప్పకముందే—"నాగన్ చూడు, నీ గడ్డాన్ని చీపురుకట్ట అంటు న్నాడు" అని నవ్వుతో పరిగెత్తింది.

"మీకు జాతకం చెబుతాను చెయ్యి చాపండి" అన్నాడు నన్ను చూస్తే. దీపం దగ్గిర కూచున్నాం.

"పెళ్ళి లేదు. జీవితమంతా వొంటరితనం—ఈ చిన్న గీత లిల్లీ."

"చిన్న దేమండీ, చాలా బలుపు" అన్నాడు నాగన్.

"ఇంతే బతుకు. ఏమీ మార్పులేదు, ఏదో పుస్తకాలు రాస్తారు. చివరికి సన్యాసులై పోతారు."

"ఏమిటి పిచ్చిముండ సన్యాసై పోతాడా?—ధనుర్మాసాలు మా యింటికి భిక్షకి, ఇప్పుడే చెప్పి పెట్టుకున్నాను, అబ్బాయ్!"

తన చెయ్యి చూపించింది.

"గొప్ప హృదయం—కాని సౌఖ్యం లేదు. ఎప్పుడూ అశాంతి."

"ఇంతే? నా జీవితం యెక్కువ కాలం భరించలేనే!"

"ఉండండి. పిల్లలు లేరు. పెళ్ళి అవుతుంది. వుండండి. గొప్ప అదృష్టం పడుతుంది."

"ఎప్పుడు?"

"ఎన్నేళ్ళు మీకు? అయితే యాడాది కిందటే పట్టాలిసింది. అదృష్ట మంచేనా! డబ్బు, భర్తకి గొప్ప హోదా, ఎవరో గొప్ప మిని....ఇన్ప్లూయన్సు అక్కణ్నించి చివరిదాకా అఖండ సాంరాజ్యం—"

"ఎవరో నవాబ్-మహారాజా....అప్పుడు మా వంక చూస్తారా? యిట్లా ఆడుతున్న రాత్రి జ్ఞాపకం వుంటుందా?"

అరుణ గంతులేస్తోంది. గొప్పదశ! అఖండ సాంరాజ్యం మహారాజు—నవాబు.

"పేరెల్లి రాణంట"

అంటో గంతులేస్తోంది.

"నాగన్, నేను సంతోషం పట్టలేను. నన్నెత్తుకో!" అంటో చిక్కకండా పరిగెత్తుతోంది.

"పిచ్చిముండా, నీకు మా రాజ్యంలో హెడ్మాస్టరు పని యిప్పిస్తానులే!"

బీస్టుగాడు మౌనంలో పడ్డాడు. ఆ రాత్రికి తన జాతకం సంగతి యోచించు కుంటున్నాడా!

నాగన్ ఆమెని గట్టిగా కావలించుకున్నాడు! స్తంభం వెనక చీకట్లో నా రక్తం పరవళ్ళు తొక్కింది. రెండు నిమిషాలు గాఢమైన వూపిరి అంత దూరానికి, నా దగ్గిరికి కూడా వినపడుతోంది.

"అబ్బా, వుండు." అంది అరుణ కంఠంలో కోపం, ఎన్నడూ లేంది.

దూరంగా వెళ్ళి, ఎంతో చివర, పిట్టగోడ లేని వేపున కాళ్ళు కిందికి వేళ్ళాడేసి కూచుని కటిక చీకట్లోకి చూస్తోంది. నాగన్ వెనకాల వెడుతున్నాడు. ఆమె మెడ తిప్పకండానే.

"వొద్దు నాగన్, వొచ్చావంటే కిందికి దూకుతా" అంది.

ఆగాడు. మళ్ళీ యే మాలోచించాడో యేమిటో, లోపల నవ్వు కుంటో వెడుతున్నాడు. ఆ తెల్లని పళ్ళతో చీకటిని చీల్చుకుంటో అతను వెళ్ళడం యిష్టంలేదు నాకు.

"వెళ్ళకండి నాగన్, అరుణ నెరగరు. నిజంగా దూకుతుంది."

నా మాటలు నిజమా? నేనే నమ్మానా? ఏమో ఎవరికి తెలుసు?.... అతను వెళ్ళకూడదు. అదీ వుద్దేశ్యం.

ఆగాడు. అరగంటయింది. ఒక్కమాట లేదు. ఏం చేస్తున్నాము? మాకు తెలుసు. ఆ పూల జాకెట్టులోంచి పొడుగ్గా, నిలువుగా, మెడ దగ్గిరికి, ముడి, మెరిసే తల, కింద వెన్నెముక నించి, వొంగి పక్కలకి చాచుకున్న పిరుదులు—చూస్తున్నాము. ఆమె మాత్రం ఏమీ చలించలేదు. అంతసేపూ మేము ఒక డబ్బా సిగరెట్లు తగలేశాము ప్లేయర్స్. బీస్టు దగ్గిరికి వొచ్చింది.

"చూడండి ఏం చేశాడో సాయేబూ! ఎంత విచారం కలిగించాడో. ఆమె ప్రాణానికి యముడిమల్లే పోగైనాడే ! నేను చెప్పలా?"

నేను మాట్లాడలేదు నా ఆలోచనలో. మీ యిద్దరూ యెవరు? అరుణ నాది! అనుకుంటున్నాను పైకి అనకపోయినా.

ఎందుకు అరుణ అట్లా వుంది. అంత నిశ్చలంగా. భయమేసింది ఏం జరుగుతోంది? హైటెన్షన్‌లో వుండే మనుషుల్ని నమ్మడానికి వీల్లేదు. మెల్లిగా లేచి వెనకగా— కూచున్నాను ఆమెకి. వాళ్ళిద్దరూ వొచ్చి

యింకొంచెం దూరాన చతికిల పడ్డారు. అబ్బా! ఎక్కడ పోగైనారు? వీళ్ళే లేకపోతే, మేమిద్దరం, ఆ డాబా చివర నా చెయ్యి ఆమె నడుం మీద....

"నాకేదో భయంగా వుంది" అంది రాత్రి నుద్దేశించి ఆమె.

"ఎందుకు?" మెల్లిగా మా వేపు తిరిగి బాసింపీట వేసుకుంది. నిజంగానే ఆ కళ్ళలో పెద్ద భయం.

"ఏదో ఆపద రాబోతోంది."

"ఛీ, నీకా ఆపద....నేనుండగా!"

"మే ముగ్గురం వుండగా!"

"రాకన్ మానవు...." అని చదివింది. చప్పున ఏడ్చింది.

ముగ్గురమూ ఆమె చేతుల్నీ కాళ్ళనీ పట్టుకున్నాము. ఇది నిజమా? ఎత్తా! నాటకమా? అని సందేహం కలిగింది నాకు. కాని వాస్తవమేనని అంటుంది నా వివేకం.

"నా ప్రాణాలర్పిస్తాను, నీ పాదాల దగ్గిర" అని నాగన్.

"నా సర్వం నాశనం కానీ నీ వాణ్ణి. దేనిమీద ప్రమాణంచెయ్యను?" అని బీస్ట్.

"నన్ను గురించి సందేహమా?" అన్నాడు ఈ పీటర్.

ఎట్లా తెలుసు మాకు. కోడి కూసే లోపల మా ప్రమాణాలు ఎంత వరకు అక్కరకు వొస్తాయో! మాయ!! క్రైస్తు శిష్యులకంటె గొప్ప వాళ్ళమా?"

"నిజంగా....నా కోసం- నే నెవరు? విద్యావతినా అధికురాలినా.... నా కెందుకు సహాయం చేస్తారు? మీ రెవరు—నే నెవరు?....కాని, నా కేం?

నేను రాణీని, నవాబును, ఐశ్వర్యం పట్టబోతోంది. నాకేం లెఖ్క" అని ఒక్క దూకు, బీస్ట్ బుజాల్ని పట్టుకుని దూకి, ఆడుతోంది.

"బీస్ట్" ఇంగ్లండులో యెట్లా డాన్సు చేస్తారు? రా, నాతో డాన్సు చెయ్యి, పిచ్చిముండా, బాండు ప్లేటు పెట్టు."

"లేదు."

"అయితే నువ్వే నోటితో వూదు, బాండు లాగు."

"అరుణ కిరణ ఉదయాచల మండిత" అని పాడాను.

చప్పున బీస్ట్‌ని వొదిలి....

"నువ్వే ఉదయాచలం. నేను అరుణ కిరణాన్ని, నిన్ను మండిత చలాన్ని చేస్తాను" అని నా వొళ్ళో పడుకుని మెడమీద చేతులేసి తలని వొంచి ముద్దు పెట్టుకుని, ఒక్క గంతేసి లేచింది.

అఖ్కర్లేని వాడికి యీ వరాలేమిటి? అని ఈర్ష్యతో వాళ్ళిద్దరూ చూస్తున్నారు.

అర్ధరాత్రి అయినట్టుంది. ఆకాశం నించి భూమికి సందేశాలు విన పడేటంత నిశ్శబ్దమయింది లోకం. ఆటల్లోంచి, కబుర్లలోంచి నిశ్శబ్దం లోకి మారాయి. అందరికీ నిద్రపోవాలని వుంది. మా ముగ్గురిలో ఎవ రమూ ఆ సంగతి ఎత్తం. స్వయంవరం పోటీ లాగుంది. నేనుకూడా ఎరీనాలో ప్రవేశించానని వాళ్ళకి తెలీదనుకుంటాను.

"రండి, నిద్రపోదాం" అని అరుణ అనేటప్పటికి ముగ్గురమూ పోలీసు వాళ్ళలాగు లేచి నుంచున్నాము.

ఎపుడో పూర్వం ఈమెని, ఈనాడు నా చేతికి చిక్కని ఈ లావ ణ్యాన్ని, అనేకసార్లు నేను రాత్రులంతా నా చేతుల్లో నా రొమ్ము మీద ఆ నల్లని మెరుగుల తలని, నాకు ఎంతో దగ్గిరగా పడుకో పెట్టుకున్నానని

తలచుకోడం....ఎన్నడూ ఒక్కసారైనా సరిగా, అనుభవించలేదే—అని పించే వ్యసనం కన్న తీవ్రంగా కాల్చింది. స్త్రీల విషయంలో-అనుభవం—కొన్ని హక్కుల్ని-అజన్మాంతపు హక్కుల్ని యిస్తుంది పురుషుడికి.

హాలులోకి వెళ్ళాం.

"పడుకోండి" అని గదిలోంచి మా పక్క చుట్టల్ని విసిరి బైట పడేసి, గది తలుపు వేసుకుంది.

ఇంతేనా యీ రాత్రికి నా గతి? పైగా లోపల్నించి కూనిరాగాలు తీస్తోంది. మేము తనని మరిచిపోయి నిద్రపోకండానా?

కానీ వీళ్ళిద్దర్నీ నిద్రపోనీ! నిన్న రాత్రి నా దయని కోరుతున్న పిల్ల ? అనిక-ఎట్లా నిరాకరిస్తుంది నన్ను?

వీళ్ళిద్దరూ ఎక్కణ్ణించి దాపరించారు? వాళ్ళిద్దరూ దాపరించకపోతే, నాకీ కొత్త ఆకర్షణ కలిగేదే కాదేమో అనే సందేహం అప్పుడుకలగలేదు. ఈ రత్నపు రాళ్ళకీ, ఈ బంగారు లోహానికీ ఈ విలవకలగడం, ఎక్కువ మంది అవి కావాలని కోరడం వల్లనే నేమో!

వాళ్ళిద్దరూ కూడా? నాలాగే, "వాళ్ళిద్దరూ నిద్రపోనీ!" అను కుంటో వుంటారని అనుకోలేదు.

నేను, నిద్ర-కల-అరుణ పక్కలో కూచుని నిన్న రాత్రి మల్లెనే నా మీద అనుకొని లేపుతోంది. నన్ను ముద్దుపేర్లతో. చుట్టూ చూశాను. ఎవరూ లేరు. కల గావును. ఏమైనారు. గది తలుపు అట్లానే వేసివుంది. ఎన్ని గంటలు? డాబా మీదికి వెళ్ళాను. అప్పుడే చంద్రుడు వాడిలిపోయిన చంపకంవలె సముద్రంమీద వుదయిస్తున్నాడు, పచ్చని చాళ్ళు చేసుకుంటో.

"ఎవరు?"

"సాబ్-ఖాయీ!"

నాగన్—ఏడుస్తున్నాడు. హడలి పోయినాను, అంత పెద్దవాడూ, గడ్డంవాడూ యాడవడం.

"ఏమిటి?"

ఆ గదికేసి చూపుతాడు.

"బీస్టు—బీస్టు లోపల వున్నాడు. చూడండి ఆ అక్రమం! చాలా నీతిలేని పని" ఆశ్చర్యంతో చూస్తున్నాను "నీతి" అనే పదం విని చాలా రోజులయింది. అందులో 'నాగన్' ఆ పదాన్ని నా మొహాన వుచ్చరించడం!

"వూరుకుంటారేం? మర్యాదస్తులు మీ యింటో ఏమిటది?"

నాతో! అరుణ, నేను కావిలించుకున్న అరుణ, వెన్నెలవలె చేతికి చిక్కక, విద్యుల్లతవలె యిటూ అటూ పరుగెత్తే అరుణ, ఈ రాత్రి నాకు వెర్రి పుడుతుందేమో. నామీద నాకు స్వాధీనం తప్పి ఏమన్నా చేస్తానేమో అనేట్టు బాధపడే నాతో యీ మొర!

"వాళ్ళ యిష్టం."

అదిరి పడ్డాడు.

"అదేమిటి? వాళ్ళ యిష్టమంటారు!"

వినిపించుకోక పచార్లు చేస్తున్నాను. వెంటబడ్డాడు. వీళ్ళిద్దరూ ఎట్లా నశిస్తారు, అని కోరుకొంటున్న నా వెంట!

"ఆమె యిష్టమంటారేమిటి? ఏ మాత్రమూ కాదు. నాకు తెలుసు. వాడిమీద యిష్టం?"

మేడ అదిరేటట్టు నవ్వాడు అతి హేళనగా, బిట్టర్‌గా.

"ఆ గేదె మీద, ఆ రాబందు మీద! ఆ సైతాన్ మీద—"

ఇంక మాటలు రాక ఆగాడు.

నిజమా? వీస్టు లోపల వున్నాశా? అంత నీచమా? అంత కళ్ళు కనపడని కామమా? పువ్వుకన్న మృదువైన అరుణకి? వీస్టా!!!

నా కే చాతనై తేనా? వీళ్ళద్దర్నీ నొదిలించుకుంటే మాత్రం? అరుణ-ఎవరిది అరుణ? ఈ లోకంలో అందం ఎవరి హక్కు? ఈ విశ్వ సౌంద ర్యాన్ని ఎవరు దాచుకోగలరు?

"పొమ్మనండి, వాణ్ణి పొమ్మనండి!" అని నా బుజం పట్టుకుని కూడా ఏడుస్తున్నాడు. నాతో, నా ముందు. ఎట్లా చెప్పను? వాడూ వీడూ, ఇద్దరూ భస్మమైపోవాలని కోరుకుంటున్నాను.

ఇతన్ని వొదుల్చుకోవాలి.

"నాగన్! అరుణని గురించి మీ అభిప్రాయమేమిటి?

మాట్లాడలేక గుడ్లు తేలేశాడు.

"ఆమె - పుణ్యరాశి — ఈ లోకంలోని మధుర రుతాలూ, పుష్పాలూ, అందాలూ - అన్నీ కలిసి - "

"అది కాదు. ఒక్కర్నే ప్రేమించి, వారినే నమ్మివుండే మనిషి కాదు. పురుషులు ఆమెకి ఆట వస్తువులు, ఆమె తృప్తికి ఉపకరణాలు." నా కసి తీర్చుకుంటున్నాను అరుణ మీద.

ఉరిమి చూశాడు నా వంక.

"చాలు ఇంక వొక్కమాట వొద్దు. ఆమెని, ఆ దేవిని, ఆ పుణ్య మూర్తిని, యేమన్నా అన్నారా - " పళ్లు కొరికాడు.

నేను నోరు మూసుకుని, ఎందుకన్నా మంచిదని దూరం పోయి నాను.

"నా పిచ్చిగాని, ఆ మాటలు చెప్పటం ఏం లాభం? నాకు పూర్తిగా తెలిసినా, ఏమన్నా నా వ్యామోహం తగ్గిందా?"

"మీరేం చెయ్యరా? నరేలెండి. ఏమన్నా కానీండి. ఆ తలుపు బద్దలుకొట్టి—దొంగ—నక్కి-పడుతున్నట్టే పడుకుని వాడు—వాణ్ణి పైటికిలాగి గొంతు యిట్లా పట్టుకొని —" చచ్చాను. గొంతు నొక్కుతున్నాడు.

"వుండు — వుండు."

"ఎక్స్యూజ్‌మీ సాబ్. నా వొళ్ళు తెలీలేదు. కాని వాణ్ణి వొదలను."

ఆపాను, ప్రయత్నించాను. అరుస్తాడు, జెబ్బలు చరుస్తాడు. పొరుగు వాళ్ళంతా లేచేటట్టున్నారు. నేను టెంపరరీగా నిష్క్రమిస్తే మంచిది.

అరుణా! అరుణ తలుచుకుంటే వీళ్ళిద్దర్నీ కూడా ఒక కంచంలో పాలు తాగిస్తుంది. అదేమో ఆమె చూసుకోవలసిందే.

మెల్లిగా కిందికి జారి తలుపు తీసుకుని రోడ్డుపట్టాను. నిర్జనమైన వీధుల్లో యెక్కడ తిరిగానో ఎంతసేపో. ఏ ఆలోచనలూ లేవు. ఒక ఆలోచన వొచ్చిందా, దాని వెనక ఇంకోటి. భయం, జెలసీ, సందేహం, ఆశ్చర్యం,అసహ్యం, నా మీద నాకు జాలి, ఈ అరుణ యెట్లా స్నేహ మయిందని కోపం. అటువంటి వాళ్ళని చేరతీసే మనిషిమీద ఏమి టీ వాంఛ అని నా మీద కోపం.

ఈ జ్వరం, యీ తాపం, యెట్లా వొదులుతుంది? ఈ మధ్యలేనిది- నాకీ రాత్రికి యెందుకు ఈ వెర్రిమోహం కలగాలి? ఎట్లా బతకడం! నిజంగా ఆ బీస్టు గదిలో చేరాడా! పుష్పానికన్నా మృదువైన అరుణ శరీ

రాన్ని, నిన్న రాత్రి నా వంక నవ్వుతో చూస్తో పడుకున్న అరుణ ఆ పెదవుల్ని — ఎంత అహంభావం పురుషుడికి! ప్రేమించాడా, తనంత సుందరుడూ, రసికుడూ, యోధుడూ - యింకెవరూ లేరనుకుంటాడు, కాని ఆ బాధ! ఆరాత్రి కాల్చినబాధ! దూరంగాపోలేను అయింటోకివెళ్ళి, నిజాన్ని యెదుర్కోలేను. నిజంగా గదిలో వున్నాడా? వుండడం నిజమైతే ఆత్మహత్య చేసుకోవలసింది. నిన్న రాత్రి, ఆమెకి ప్రియులున్నారని నాకు తెలీదా? తెలిసినా బాధలేదు. ఈ రాత్రి యిట్లా యెందుకైనాను?

వెళ్ళాను. కాళ్ళీడ్చుకుంటో, మేడమీద దీపాలు, కంఠాలు, ఏమిటీ కొత్త గోల? చంపాడా?

ప్రజలా? పోలీసులా? బావుంది. ఆ బీస్టు చచ్చిందంటే కొంత తృప్తిగానే వుంది.

నేను గుమ్మంలో అడుగు పెట్టానోలేదో, యిటూఅటూ ఇద్దరుగట్టిగా పట్టుకున్నారు. హడలిపోయినాను. నోట అరుపు కూడా రాలేదు.

"భాయ్!"

"మిష్టర్!"

నాగన్, బీస్టు ఇద్దరూ! ఇద్దరి మొహాల వంకా చూశాను. ఇద్దరూ బూజం ఫ్రెండ్స్ (Bosom friends)—

"ఎవరో వొచ్చారు."

"వాడెవడు అరు...."

"ఆ దొంగుగాడికి అదేం అధికారం?"

"అరుణ—అదేమిటి అట్లా భయపడుతుంది! భయం అంటే యెరగని—"

"మాస్టర్ సాబ్, వాళ్ళు వీల్లేదు మన యింటో."

"వీల్లేదు పంపెయ్యండి."

"పంపడం కాదు, చంపేద్దాం."

"దీస్టు నువ్వు ఆపంగనామాల వాణ్ణి, నేను ఆ బొండంగాణ్ణి—"

"నువ్వు ఆ ముసలిదాన్ని వేసుకో, మాస్టర్ సార్!"

"ఏమిటది!" అన్నాను.

"చంపేద్దాం."

వాళ్ళతో లాభం లేదని ఆశ్చర్యపడుతూ పైకి పరిగెత్తాను.

తొరతొరగా పరిగెత్తికెళ్ళి, చీకట్లో చూడక ఏదో బస్తాకి తగిలి, బోర్ల బొక్కాల పడ్డాను. ఆ బస్తా మూలిగింది. దులుపుకు లేచి చూస్తే ఆ బస్తా మూలిగే ఆచార్ల కింద మారింది. తెల్ల గడ్డం, చేతిలో రుద్రాక్షల తావళం. అంతటితో ఆయన్ని వొదిలెయ్యవచ్చు. ఎందుకంటే కథ ఆఖరయే వరకు రుద్రాక్షలు తిప్పడం తప్ప ఆయన యేమీ చెయ్యలేదు, చీకట్లో నన్ను పడెయ్యడం తప్ప.

హాలు మధ్య కూచుని వున్నారు కథా నాయకులు. కుంటుకుంటో పోయినాను. అరుణ తలెత్తి కూడా చూడలేదు. ఆమె మాటాడిన జ్ఞాపకమే లేదు. మాటలన్నీ జయరావే కానిచ్చాడు. జయరావు తల్లి కూడా వుంది గాని జయరావు అన్న పదానికల్లా ఊత ఇవ్వడం తప్ప ఆమె కూడా స్వతంత్రించలేదు.

జయిరావు అరుణ అధికారి. స్వంత హక్కుదారుడు, సంఘం, లా, నీతి, దేవుడు, దోవన పోయేవారు, అందరూ అతన్ని యజమానుణ్ణిగా నిలబెట్టారు. అంటే అరుణ భర్త.

అంతేగాక జయరావు మా నాన్న స్నేహితుడు. ఇంకా నన్ను కుర్రాడికిందే ట్రీట్ చేస్తాడు.

"ఏమిటిదంతా?" అన్నాడు మామూలు అధికారంతో.

ప్రశ్న వెయ్యడం ఎంత సులభం?

నేను మోకాలు చర్మం ఎంతవరకు భూదేవి తీసుకుందో చూసు కుంటున్నాను.

"ఈ వెధవకారునంతా ఎక్కడ పోగు చేశావు?"

కనుకొలికి లోంచి అరుణ వంక చూశాను. కొత్త పెళ్ళికూతురు వలె అమాయకంగా, సిగ్గుతో తల వొంచుకుని కూచుంది.

"ఏ మాట అంటే ఎటు జారతానో! 'అమాయకురాలు' అబల, సుకుమారి, ఆమెకి ఏం అపాయం తెస్తానో!

"వాళ్ళు...."

"ఊ, వాళ్ళు?"

"చదువుకున్నారు, నాతో."

"ఐతే?"

ఏమంటావు? ఏం చెప్పమంటావు? అరుణా? నువ్వేం చెప్తావు? ఎందుకు పోయినాను బైటికి?

అప్పుడే విచ్చి ముఖం కేసి చూసే పువ్వుని ఎవరన్నా నలిపేస్తారా వేళ్ళల్లో! అప్పుడే నిద్రలోంచి బైటికివొచ్చి చేతిమీద కూచున్న సీతాకోక చిలక కంఠం నులుముతారా? అరుణ అంత నిస్సహాయంగా, దయని హృదయంలోంచి పిండుతో చూసింది.

"ఏం చెయ్యను మరి? కిందనే వుంచాను?"

"కింద వున్నారా? ఐనా నువ్వెక్కడికి పోయినావు? యీ అర్ధ రాత్రి అరుణని ఆ పశువులతో వొదిలి?"

ఏం చూశాడు? బీస్టు ఎక్కడ వున్నాడు వీళ్ళు వొచ్చినప్పుడు? ఎవరు చెపుతారు నాకు?

"మేనర్ లెస్ ఫ్రెండ్స్" అన్నాను.

"ఏదో, చిన్నప్పటి స్నేహితుడివని నమ్మి నీ యింటికి ఒస్తే బాగా చేశావు!"

"మంచివాడివి నాయనా!" అంది ముసలమ్మ.

"ఐనా, నువ్వెందుకు పెళ్ళి చేసుకోవు?"

అరుణ పెదవుల చివర నవ్వు!

"ఆ రాచర్ల వారి...."

"అమ్మా! వుండు—"

"ఇది ఎందుకు వొచ్చింది యిక్కడికి అసలు?" అన్నాడు.

ప్రశ్న బావుంది!

ఆ మెట్ల మీద చప్పుడు వాళ్ళిద్దరూ వొస్తున్నారు గావును బాబూ!

"స్కాండలస్ (Scandalous) ఈ కాలంలో ఆడవాళ్ళకి ఏమీ...."

తక్కింది చేత్తో చూపించాడు.

మెట్ల మీద దగ్గు! ఏం చెయ్యను!

"నెక్స్టు ట్రెయిన్"

"నాలుగింటికి."

"ఆ సాయేబు యెవడు నీ యింట్లో? వాడు మేడ మీదికి యెందుకు సగం మెట్లు దిగుతున్నాడు నేను వొచ్చేటప్పటికి? ఆ యెలుగుబంటిగాడు నయం, మర్యాదగా వీధుల్లో వున్నాడు."

అమ్మా!

కాని, నిజంగా బీస్ట్ ఇన్నోసెంటేనా?

అమ్మ! ఎంత బరువు దించినట్టయింది, నా గుండెల మీద నించి! కాని—

ఆ పంగనామాలవాడు గొణుగుతున్నాడు—

తావళం తిప్పుతో—

"మూడయింది, బైలుదేరదాం." అని.

ఎవరూ మాట్లాడలేదు.

అరుణ మాత్రం నా వంక కొంచెంగా కళ్ళెత్తి చూసింది. కొత్త పెళ్ళికూతురు తల్లివంక చూసినట్టు.

"అప్పుడే వెడతారా ,రెండు రోజులు వుండండి?" అన్నాను అతిధి సత్కార పూర్వకంగా, మర్యాదకోసం. ఉండరని నాకు తెలుసు. కాని తెలివికన్న, గొప్పశక్తి నా మీద యెట్లాంటి 'జోక్సు' ప్రయోగిస్తోందో ఎట్లా తెలుసు?

"ఇక్కడా! చాల్లే! ఒక్క నిమిషం అరుణని ఈ ఇంట్లో వుండనిస్తానా?"

ఈ భర్తలంత ఫూల్స్ ప్రపంచంలో వుంటారా అనుకుంటాను. కాళ్ళ కిందినించి భూమి కొట్టుకుపోయినా, ఇంకా అధికారం తమదే అనట్టు మాట్లాడతారు. భార్య జారిపోయినా, భర్త అధికారాన్ని చేతుల్లోనే పట్టుకుని డాబుగా కూచుంటాడు, పారిపోయిన దొంగవాడి పై బట్టను పట్టుకుని ప్రతాపాలు కొట్టే పెద్ద మనిషిలాగ! పారిపోయిన గుర్రం కళ్ళెం చేత్తో పట్టుకుని కళ్ళెంకోసం గుర్రం తిరిగి వొస్తుందని ఆశపడే వెర్రి రౌతులాగు!

"నేను రాను."

నిశ్శబ్దం! ఆచారి మహాశయుడు మాత్రం కొంచెం బిగ్గరగా, "భగవతీ-" అంటో గొణిగాడు.

"ఏమిటోయ్! ఏదో రాదట!" అన్నాడు జయరావు నాతో!

ఈ ప్రశ్నలు వెయ్యడానికి నేను వొరికానా?

"రాక"—అన్నాడు భార్యవంక.

"అడక్కు—తిను" అని అందిచ్చింది తల్లి.

"అదే నయం" అనుకున్నాను. కాని బైటికి అనలేదు.

"ఎందుకు రావు?"

మాటల్లేవు. బైట చల్లని గాలి మొదలు.

"నిన్నేం కష్ట పెట్టాను? కొట్టానా, తిట్టానా, నీకేమన్నా లోటు చేశానా? ఏ మీటింగులకన్నా అటంక పెట్టానా? పదిరోజుల కిందట ఆదేదో కాకినాడలో స్త్రీల మీటింగని బైలుదేరితివి. ఒక్క ఉత్తరం లేదు—చిన్న వెంకటేశం యీ వూరు రైలు స్టేషనులో నిన్ను చూశానని రాస్తే, తెలిసింది."

వెంకటేశమేనా? బంధువుల్లో, మర్యాదస్తుల్లో వెంకటేశమంత వివేకవంతుడు, బుద్ధిమంతుడు, ఆదర్శవ్యక్తి లేడని ప్రతీతి. అతని పేరు వింటే ఆ రోజల్లా జబ్బు పడతాను నేను. ఆత్మహత్యకి బుద్ధి పుట్టినప్పుడల్లా వెంకటేశం జ్ఞాపకం వొస్తాడంటుంది అరుణ. మరేం లేదు వాణ్ణి ముందుచంపి, లోకానికి కడపటి వుపకారం చేసి మరీ పోదామని.

వాళ్ళిద్దరూ కింద యేం చేస్తున్నారో పైకి పిలిస్తే పాపం?

"అవును, పుణ్యాత్ముడు వెంకటేశం రాసిందాకా, తెలీనే తెలీదూ!" అంది ముసలి చిలక.

"ఏం మాట్లాడవేం? ఏం లోపం చేశాను చెప్పు?"

ఆ మాటే యీ కాలంలో ఎంతమంది స్త్రీలను, అనాథలను, అమాయకుల్ని అడుగుతున్నారు, పంచాయతులలో, ఇళ్ళలో, కోర్టుల్లో, వీధుల్లో, పదిమందిలో? ఏం లోపమా? ఆ స్త్రీ నలుగురి ముందూ చెప్పలేని లోపాలు—ఆమెకే తెలీని లోపాలు, చెప్పినా లోపాలని లోకంలో వొప్పుకోని లోపాలు! ఈ కొత్త కాలంలో, కొత్త వూహల్లో, కొత్త పిలుపుల్లో, కొత్త వాతావరణంలో, ఆత్మని నలుదిక్కులకీ కొత్త ఆశలు పెట్టి అశాంతి పరిచే కొత్త కాంతుల్లో, స్త్రీని పాత గూళ్ళల్లో, తుక్కు పురాణ నీతుల్లో, నవీన జీవితానికి ఏ సంబంధమూ లేక పుచ్చిన నీతి నిబంధనల్లో, కుళ్ళిన ముసలమ్మల శాసనాల్లో, దుర్భరమైన గృహాల్లో కళ్ళుమూసి, బంధించి వుంచాలని చూసే నేర్పుగల ధూర్త లోపం. కుల గిరులే, దేవతలే, భూమే మారుతూ వుంటే, స్త్రీని మాత్రం, జీవనం తీసి శిలనిచేసి మూల దాచాలని చూచే మూర్ఖపు లోపం! వాళ్ళని చిగురింపచేసే వసంతోత్సవం లోక కళ్యాణంగా కలుగుతూ వుంటే, తలుపులు బిగించి స్త్రీని "నా మొహం చూడు, నా బొర్ర చూడు." అని కులుకుతో యెదురుగా నుంచున్న లోపం!

ఎట్లా చెప్పుకుంటారు స్త్రీలు ఆ ప్రశ్నలకు జవాబు!

అరుణ మాట్లాడలేదు.

"ఏం అదేదో చెప్పరాదూ?"

అనుమానం వుంది. ఏదో లోపముందని. అదేదో ఆ మానవుడికే తెలీదు. తెలిస్తే దిద్దుకుందామనే ప్రయత్నం చేస్తాడేమో! ఎందు కిట్లాంటి కష్టం తనకు ప్రాప్తించిందా, తాను ఏం చేశానా, అని విస్మయం చెందే జయరావుని చూస్తే జాలేసింది.

అంధకారంలో, దోవ తెలీక తడుముకోవడమేగా జీవిత యాత్ర అంటే !

"లోపం లేకపోవడమే గొప్ప లోపం కావొచ్చు." అని విట్టు వేద్దామనుకున్నాను కాని ధైర్యం లేకపోయింది. ఆ ముసలమ్మని చూస్తే. కళ్ళు భ్రమింపచేసే సౌందర్యం కావాలి జయరావుకీ, తక్కిన పురుషులకీ, ఇళ్ళనీ, మంచాల్నీ వెలిగించేందుకు. కాని ఆ సౌందర్యం వెంట నడిచే బాధ్యతలు అక్కర్లేదు. అంగీకరించే ఉదారతా లేదు.

పద్మం కావాలి. భ్రమరాలు అక్కర్లేదు. తోలితే ఒక్కొక్కప్పుడు కుడతాయి. పద్మాన్ని దుమ్ములో జారవిడుస్తాము, లేక ఆ తొందరలో రేకుల్ని చీల్చేస్తాము.

అయ్యో ఎంత గతి పట్టిందని కనికరించి యెవరన్నా రేకుల్ని పోగుచేస్తే అపనిందలు సాగిస్తాము.

"నేను మీతో రాను."

అదే మాట !

"ఆవును ఎందుకు వొస్తావు? సుఖంగా తిరగడం మరిగిందానివి! నీకు మొగాళ్లూ, షోకులూ, నీ ఆటలూ—" అంటోంది.

మొగవాడు వూరుకున్నా, ఆడది వూరుకోదు. ఏ సంగతినయినా మంచాల అసహ్యపు 'లెవెల్'కి లాగిందాకా !

కొడుకు అందుకున్నాడు. తల్లి 'వాల్వు' తెరిచింది. కొడుకు లోపలి కోపం దాంటోంచి ప్రవహించడం ప్రారంభించింది. ఏదో అనబోతు న్నాడు — మరవలేని మాటలు - ఎన్నేళ్ళో కలిసివున్న హృదయంలో కలుకుమనే మాటలు అనబోతున్నాడు.

"పోనీ, నాలుగురోజులు ఉండనీండి ఇక్కడ. ఆలోచించుకుని వొస్తుంది." అన్నాను.

"ఇక్కడా? ఈ ఇంట్లో ఏం ఖర్మం నా భార్యకి ఇక్కడ వుండ డానికి?"

తన పెద్ద మేడా, మోటారూ, ఆవులూ, పట్టుకుర్చీలూ తలుచు కున్నాడు.

"ఈ రౌడీలూ, తురకాళ్లూ."

"అదేం పాడు బుద్ధి నీకు? ఈ వెధవలంచరా నీకు స్నేహితు లేమిటి? ఎటువంటి వంశం మీది? మీ తాతగారు యజ్ఞం చేశారుకదా? మీ పినమామగారు వైశ్యదేవం చేసేవాడు? నువ్వు మరీ యింత భ్రష్టుడివై పోయినావేం?" అంది.

"కాని యిది యెందుకు రావాలి వీళ్ళ దగ్గిరికి? దానికి పుట్టిన బుద్ధే లేద్దూ!" అంది మళ్ళీ.

ఆ మొగాడు స్త్రీ మీద వ్యామోహంతో తన ఆత్మనే వంచన చెయ్యాలని చూసినా తల్లి వూరుకోదు. ప్రేమ గల తల్లి. ఇంకా అంటోంది.

"దాని గుణం దాని రక్తంలోనే వుంది లేద్దూ. దాని పిన్నమ్మ గారు—తెలుసుగా!" నాకు వొళ్ళు మండింది.

"పోనీ. వొదలెయ్యండి."

"ఎందుకు ఒదలాలి?" అన్నాడు జయరావు.

"ఆమె చాలా అవినీతి పరురాలుగా! అక్రమమైన స్నేహాలు చేస్తుందిగా!"

"ఎవరన్నాడు ఆ మాట!"

"నే నంటున్నాను."

"అంటే పళ్ళు రాలతంతాను! అరుణ! అరుణని అంటావా ఆ మాట?"

నా యింటోకి ఒచ్చి నన్ను తంతానంటే! 'నా యిల్లు' అని యీ నాడు జ్ఞాపకం ఒచ్చిందిగాని, ఆనాడు రాలేదు, మరి యెందుకో యే జన్మలో జీవనం నెత్తిమీద కొట్టి ఆ భావాన్ని ఒదులు చేసిందో. నా ఇల్లు, నా డబ్బు, నా ఆస్తి, నా భార్య-ఇట్లా యోచించడం చాలా తక్కువ నాకు.

"కోడళ్ళకి కరువేముంది యీ దేశంలో" అన్నాను.

తల్లి కళ్ళు మెరిశాయి ఆశతో. కాని మొగవాడు — కొడుక— అరుణ గ్లామర్‌కి దాసుడు. ఏం చేసినా, అరుణ, తనముందే వ్యభిచరించనీ, వియోగాన్ని భరించలేక అమర్యాద పడలేక తాను చూడలేదని నమ్మడానికి సంసిద్ధుడైన మొగవాడు—

"అరుణ ఏం చేసింది పాపం! ఈ పిచ్చి అరుణ. ఇంకా చిన్నతనం ఒదలలేదు, అల్లరిపిల్ల" అని ఆమెని విడవడమనే తలుపునన్నా భరించలేక, ఆమె బుగ్గ పట్టుకున్నాడు.

ఆ దృశ్యం భరించలేక తల తిప్పేసుకున్నాను.

రెండు నిమిషాలయింది. ముసలిది వూరుకో తలుచుకోలేదు.

"రైలు టయిమవుతోంది మరి!"

మౌనం.

"బండి పిలవరా, అదే ఒస్తుంది!"

"పిలు బండి."

కిందికి దిగుతూ అరుణ వంక చూశాను. ఏమీ కనురెప్ప కదల్చలేదు. మెట్ల దగ్గిర నా కంపానియన్స్ ఇన్ మిజరీ companions in misery ఇద్దరూ పట్టుకున్నారు.

"ఏమయింది? ఏమయింది?"

నాకు జవాబు చెప్పే వోపికలేదు. చెపితే వీళ్ళిద్దరూ యేం గోల చేస్తారో, మాట్లాడకుండా వెళ్ళి బండిని కేకేశాను.

"వెడుతున్నారా?"

ఎంత సంతోషం, వాళ్ళకి? అరుణ వుంటుందనే వాళ్ళ ఆశ, నా కెందుకు?"

తల వూయించి పైకి పోయినాను.

"వెళ్ళి వస్తామమ్మా!"

లేవారు.

అప్పటికి అరుణ నా వంక చూసింది. నేను కళ్ళు కిందికి వాల్చాను.

"నేను రాను."

"రావూ, రావూ, ముమ్మాటికీ."

"రాను."

"ఇంక యీ పాటికి లే."

ఆ కంఠంలోనే తెలుసు నాకు, వాళ్ళతో వెళ్ళదని, కాని వెళ్ళక—?

భార్య భర్త పిలిస్తే వెళ్ళక?— తరవాత ఆలోచన రాదు. మహా సముద్రం.

ఎక్కడో నా విద్యని, విజ్ఞానాన్ని, నా సానుభూతిని, తర్కాన్ని, నేను కష్టపడి నిర్మించుకున్న అభిమానాన్ని, దాటి, ఎక్కడో లోపల నా పితృదేవతల రక్తం—

"బాగా జరిగింది. ఆడది హద్దు మీరి లోకం మీద పడదమా? తురకాళ్ళూ, మంగలాళ్ళూ స్నేహితులా! పో, లాక్కుపో, భర్తవి, అధీనం చేసుకో!" అంటోంది నాకు తెలీకండా కులాన్ని నిరాకరించిన నా కులాభిమానం, మతం లేదనే నా మతాభిమానం, స్త్రీ స్వేచ్ఛకోసం పోట్లాడే

పురుష అహంకారం, జెలసీ. చచ్చాయనుకొన్న ఆ ముళ్ళ మొక్కల మోళ్ళన్నీ చిగిర్చాయి, ఆ రాత్రి ప్రవహించిన కన్నీళ్ళలో. కాని. అప్పుడు నాకు తెలీదు ఆ సంగతి.

సరిగ్గా ఆ సమయానికే ఆ యిద్దరూ పైకి వొచ్చారు.

"అరగంటా అయింది" అన్నాడు బీస్టు.

నాగన్ అరుణ దగ్గిరిగా వెడుతున్నాడు.

"ఎవరు నువ్వు?" అన్నాడు జయరావు.

"క్యా? దివానా హ్యా?" అన్నాడు సాహేబు.

"పద!" అన్నాడు అరుణని భర్త.

వాళ్ళిద్దరూ రావడంతో అరుణకి కొత్త ధైర్య మొచ్చినట్టుంది. ఇరవై మంది జయరావుల్ని పచ్చిగా విరుచుకుతినే సామర్థ్య మున్నట్టు కనపడే తన ఆరాధకుల్ని చూసి.

"నేను రానని ఒకసారి చెపితే చాలదా? రాను రాను రాను." అని గదివేపు తిరిగింది.

జయరావు చాలా నాగరికత చెందిన మనసుబు. జయరావులో ఏ మృగాలు గోంద్రుమన్నాయో!

"రావా-" అని ఆమె బుజం పట్టుకుని లాగబోయినాడు. ఒక్క చిన్న మెలికతో బుజాన్ని తప్పించింది అరుణ. జుట్టు పట్టుకున్నాడు జయరావు. ముడిలోంచి పువ్వులూ, పిన్నులూ జల జల రాలాయి. ఆడది యెదిరిస్తే భరించగల మొగాడు మొగాడా ? ఒక్క చక్కని ఫుట్ బాల్ కిక్కుతో జయరావుని గోడకేసి తన్నాడు బీస్టు.

"అచ్చా!" అన్నాడు మహమ్మదీయుడు. అప్పటికి ఏకమైనాయి వాళ్ళ ఫీలింగ్స్ పూర్తిగా.

ఝల్లుమని సంతోషించింది—నా హృదయం. బైటికి నిర్ఘాంతపోయి చూస్తున్నాను నేను. కాని,

"భగవతీ—" అంటున్నాడు పంగనామాలు ఆయన.

తల్లి మాత్రం కొడుకుని లేవతీస్తోంది.

కొడుకు నోట మాట లేక, చూస్తున్న వాడల్లా తటాలున.

"ఎవడు వీడు? ఎవడు వీడు? పోలీస్, పోలీస్ యెట్లా రానిచ్చావు వీళ్ళని నీ యింటికి? వీ ళ్ళ నీ స్నేహితులేమిటి?" అంటో లేచాడు నా మీదికి.

కౌరవ సభలో ద్రౌపదివలె రొమ్ము వగరుస్తో కళ్ళ నిప్పులు రాలుస్తో నుంచుంది, అరుణ. ఆ సభలో దుశ్శాసనుణ్ణి చంపివుంటే ద్రౌపదికి వచ్చే సంతుష్టి కనపడ్డది ఆమె కళ్ళలో కొంచెంగా.

నేను నిందాపరంగా చూశాను బీస్టు వంక.

"అరుణని-అరుణ జుట్టుని- వీడు- యీ పశువు తాకుతాడా."

కోపంగా మళ్ళీ ఏదో చెయ్యాలన్నట్టు చూశాడు అరుణ వంక జయరావు.

"ఆ, నే నున్నాను జాగ్రత్త!" అన్నట్టు నాగన్ అడ్డంగా కదిలాడు కొంచెం. జయరావుని చూస్తే జాలేసింది.

"భాయీ! వీణ్ణి బయట పారెయ్యనా?" అన్నాడు నాతో నాగన్.

అరుణ నవ్వు పెదవుల్లోనే కుక్కుకోలేక పోయింది.

"ఆమె భర్త." అన్నాను.

ఆ 'భర్త' అనే పవిత్రపదం అన్ని దౌర్జన్యాలనీ, అసహ్యాలనీ, క్రౌర్యాలనీ, కడిగివేసే మంత్రాక్షరం వలె.

భర్త! ఆ మాట ముందు యిష్టాలు, ధర్మాలు, హృదయాలు, స్వేచ్ఛలు, ప్రేమలు, పాపాలు-అన్నీ తలలు వొంచి తప్పుకోవలసిందే!

బీస్టు, సాహెబ్ తెల్లబోయి నా వంక చూశారు. ఒక్క మాట లేదు. మెల్లిగా హాలు ఆ చివర కిటికీ దగ్గిరికి వెళ్ళి నుంచున్నారు, మాట్లాడకండా. అన్ని మతాలూ తల వొంచవలసిందే ఆ భర్త అనే పదం ముందు.

అరుణ పెదవి విరిచి, కళ్ళు వాల్చింది కిందకి.

ఇప్పుడు స్పష్టంగా తెలుస్తోంది. ఇదివరకు వాళ్ళకి తెలీదు, జయ రావుకి వున్న అధికారం. దేవుడూ, నీతి, పురోహితుడూ, అరుణ తల్లీ, ఆశీర్వదించి జయరావు చేతుల్లో పెట్టిన హక్కు యిప్పుడు తెలిసింది. ఆ భర్త అనే వొక్కమాటతో తమ బాధ్యతల్ని ఒదులుకుని, సంబంధాల్ని కోసేసుకుని ధర్మపరులు, మర్యాదస్తులు, ఉద్యోగస్తులు వాళ్ళద్దరూ తప్పు కున్నారు.

"తమరు భర్తా, తెలీలేదు. క్షమించండి. ఆమెని తీసుకోండి, కోసు కోండి, మాకేం సంబంధం?" అంటున్నాయి వాళ్ళ దేహాలు, ప్రతి స్వేద నాళంలోంచీ. వాళ్ళు మాత్రం భర్తలు కారా? కాబోరా? సంసారపు

వాక్కుల్ని పునాదుల్ని ప్రశ్నించి ఎదురు తిరిగితే ఆడది? వాళ్ళ భార్యల మీద హక్కులు నిలవాలా? లేదా?

అదే మొగాళ్ళకీ మొగాళ్ళకి వుండే కన్వెన్షన్ అదే ఫెయిర్ ప్లే. ఆ 'ప్లే'లో ఆడది చేరదు. అన్నీ మొగవాళ్ళ క్లబ్బులు.

"థావుజ్జే?"

అన్నాడు జయరావు.

అరుణ వంక చూశాను. నా వంక చూసింది.

"నా ఆరేశిన చీరా, దుప్పటీనా ఏవీ?"

నన్నడుగు తుందేం?

అమ్మో! జయరావు నిట్టూర్పు విడిచాడు.

గదివేపు వెడుతోంది. బుజం మీదనించి నావంక వక్కసారి చూసి. నా బుద్ధి మాంద్యాన్ని కూడా చీల్చింది ఆ చూపు. అర్థమయింది. వెంటనే వెళ్ళాను.

చీకటి గదిలో మరీ చీకటి మూల నా సూట్కేసు కోటు పక్కన వెతుకుతోంది. చప్పున నా మెడమీగ చేతులేసి,

"నేను వెళ్ళను, నేను చచ్చిపోతాను పెడితే, నేను వెళ్ళను. నన్ను పంపకు" అని యేడ్చింది.

"వెళ్ళక—"

ఎన్ని కథలు రాస్తేనేం? కలలు కంటేనేం? కబుర్లు చెపితేనేం? కోతలు కోస్తేనేం? భార్య భర్తతో వెళ్ళనని ఎదురు తిరిగి గతిలేదని శరణు చొస్తే—

"వెళ్ళక—! !"

నా మర్యాద? నా గౌరవం?

"ఇక్కడే వుంటా. నీతో."

"అతను గోల చేస్తాడు."

"చెయ్యనీ, నన్ను రక్షించు, జ్ఞాపకం తెచ్చుకో ఆ మధ్యాహ్నం--"

అన్యాయం, నన్నట్లా యిరికించడం కాని వుంటే మాత్రం నాకేం శాంతి? ఈ గుంపులు? ఈ కొత్త వాళ్ళు, తురకాళ్ళు, మాలాళ్ళు—

అంతా యెవరు ఆలోచించినా, యెంత ఆలోచించినా, 'నాకేం వొరుగుతుంది, నాకేం వొరగదు' అనే కదా? 'ఆమెకెట్లా వుంటుంది?' అని కాదు.

ఆ చీకట్లో, ఆటెన్షన్‌లో మాటలు లేకండానే మొహాలు కన పడకుండానే నా యోచనలు ఆమెకి తెలుస్తున్నాయి గావును--

"ఎవరూ వొద్దు నాకు, నీ సేవ చేస్తో ఆ మూల పడి వుంటాను. ఇంక యెక్కడికీ పోను యెవరినీ చూడను. లిల్లీకి--"

అరుణా, అరుణా! ఎంత నీచగతికి దిగావు? గర్వంతో గడ్డం యెత్తి లోకాన్ని ధిక్కరించే నువ్వు? ఆకాశాన యెగిరే గరుడుడివి- ఇదేమిటి? అని కుంగిపోయింది నా హృదయం.

ఇదేమిటి? ఒక భర్త బెదిరింపుతో ఏమిటి ఇట్లా ఐపోయినావు?

కాని— ఆ భర్తా, పోలీసుల రక్షణా. ఆర్గనైజ్డ్ సొసైటీ వుండబట్టే కద, ఆమె ఆ ఆటలాడింది!

స్వేచ్ఛ, స్వేచ్ఛ అంటాంగాని, మనని బంధించి నిలబెట్టే యీ దేశం, సంఘం, కట్టుబాట్లు, మర్యాదలు, ఈ నాచురల్ లాస్, ఫిజికల్ లాస్, సోషల్ లాస్ సరిగా పని చేస్తున్నంత సేపే, మన స్వేచ్ఛా వాదాలూ ప్రణయాలు-శరీరం సరిగా పని చేస్తున్నంత సేపే అసత్యాలూ శరీరపు నిబంధనలకి యెదురు తిరగడాలూ! గంతులూ!

"వుండవోయీ" అన్నాను.

నా భీరుత్వమూ, నా విజ్ఞానమూ, ఏది ప్రోత్సహించింది ఆ మాటని! స్త్రీకి నరకంగా వున్నా సంసారమే స్వర్గమని! ఎంత యముడైనా భర్త కన్న మిత్రుడు లేడని!

చప్పున వొదిలి బైటికి వెళ్ళింది.

నేను కదలలేక, ఆ పక్కమీదనే కూలబడ్డాను.

నా నీచత్వం నాకు అప్పుడే తెలుస్తోందనుకుంటా! కాని మెదడు పని చెయ్యడం లేదు.

"అరుణ వెళ్ళకూడదు. నాకు కావాలి," అనే బాధ వొక్కటే కణ తలలో కొట్టుకుంటోంది.

కాని వుంటే, నా దగ్గిరే వుంచుకుంటే మాత్రం నాకు దక్కు తుందా? నా ఆసరా చూసుకుని లోకమంతా తిరుగుతుంది.

'నా' అనేది మనసును వొదలదు కదా!

నేను గదినించి బైటికి వొచ్చేటప్పటికి ఆ ఐదు నిమిషాల్లో దృశ్యం మారింది. జయరావు చేతివేళ్ళను పట్టుకొని, మలయ మారుతంతో ఆమె జుట్టు అతని మొహానికి తగులుతో మాట్లాడుతోంది అరుణ.

"దూడకి, తల్లివి నల్ల మచ్చలు ఏమన్నా వొచ్చాయా? తోటంతా గంతులేస్తోందా? చూడాలని వుంది పిచ్చి ముండని—"

నిన్ను కాదు అన్నట్టు హేళనగా నన్ను చూసింది.

"నా సపోటా మొక్కని తినెయ్యలేదు కద! వెనక పాక వెంకు నెయ్యడం అయిందా? నేను లేకపోతే ఎవరు కత్తిరిస్తున్నారు గులాబీ మొక్కల్ని?"

అతను అమితమైన ఆనందంతో ఆమెలో లీనమైపోయినాడు. వీళ్ళిద్దరూ జన్మంలో యెప్పుడన్నా తగులాటారా? అనుకుంటారు చూసిన వాళ్ళు.

నేను డాబా మీదికి వెళ్ళాను. రెండు నిమిషాల్లో అందరూ కిందికి దిగుతున్నారు. ముందు జయరావు, తరువాత అరుణ—వెనక అత్తగారు, తావళం తిప్పతో ఆచార్లు—జయరావు సామాను పట్టుకుని బీస్డు, అరుణ సామాను పట్టుకుని నాగన్.

అరుణ తలెత్తలేదు. నా వంక చూడలేదు. ఒక్కసారి పెద్ద గాలి పీచింది.

కోడి కూసింది. కింద బండి కదిలింది.

నేను నిట్టూర్పు విడిచి, హాల్లోకి వెళ్ళాను. హాలు మధ్య అరుణ తలలోంచి పడ్డ చంపక పూలు.

ఇల్లు బావురుమని యేడ్చింది. సంతోషమంతా అరుణ కొంగున కట్టుకు తీసుకుపోయింది. పైకి వొస్తున్నారు నాగన్, తరవాత బీస్టు—అబ్బా వీళ్ళుకూడా పోకూడదూ? వాళ్ళ చేతుల్లో సామాన్లు, వెనక ఆచార్లు—వెనక తల్లి, జయరావు—అతని బుజాన్ని ఆనుకుని అరుణ.

"ఏం లాభం వెళ్ళి. రైలు వెళ్ళిపోయి వుంటుంది. నెక్స్టు ట్రెయిన్" అన్నాడు జయరావు ఉత్సాహంగా.

"పదింటికి."

"పడుకుందాం కొంచెం సేపు."

పక్కలు పరిచాము, జయరావు గదివేపు చూశాడు. అరుణ వేపు చూశాడు. నా రక్తం గుండెల నించి ఒక్కసారి తలకెక్కింది.

అరుణ ఒక్కత్తె గదిలోకి వెళ్ళి తలుపు వేసుకుంది. నా హృదయం శాంతించింది. నేనో మూల కన్ను మూస్తున్నానో లేదో, జయరావు వచ్చి నా ప్రక్కన కూచున్నాడు. ఏమేమిటో మాట్లాడాడు. నాకు నిద్ర వొస్తోంది. వొదలడు.

"నిజం చెప్పు. అరుణ వీళ్ళందరితోనూ—అంత నీచపు పనులకి వొడిగట్టిం దంటావా?"

"ఛా." అన్నాను.

అంటే అర్థం, హంస బురదని కెలికితేనేం, హంసకి ఆ బురద యెంతమాత్రం అంటుతుంది? అన్నమాట.

# 18. మసకవెలుగు

పక్కయింటివారి దినచర్యను అతడు కిటికీలోనుంచి ప్రతి రోజూ చూస్తుండేవాడు. అది సంపూర్ణచిత్రంలో బిందువుల మోస్తరు, రేఖల మాదిరి కనబడుతుండేది. అందులో చూచి గ్రహించదగింది కొంత, ఊహాగానం చేయవలసింది కొంత ఉండేది.

వనమాలి ఒకనాడు తన పుస్తకంమీది నుంచి దృష్టి మరలించి కిటికీవైపు సారించాడు. ఇంట్లో అపరిచిత వ్యక్తులిద్దరు కనిపించారు. ఒకతె నూత్నయౌవన. ఒకరు వృద్ధాంగన.

వృద్ధురాలు కిటికీలో కూర్చొని యువతికి జడవేస్తున్నది. ఆమె మొరటుచేతులు ఆ కోమల సరోజాల్లోకి దూరాయో లేదో ఆ యువతికి కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి.

ఒకనాడు యువతి సంధ్యాసమయంలో ఒంటరిగా గుమ్మానికెదురుగానుంచొని మసకచీకటిలో పటంకట్టినఅద్దాన్ని పరిశుభ్రంచేస్తున్నట్టు తోచింది.

కిటికీగుండా వనమాలి ఆమె నిత్యకృత్యాలను గమనిస్తుండేవాడు. ఆమె ఏదో ఒక పనిమీద డాబామీద తిరుగుతూనే ఉండేది. ఒకసారి మేజోళ్ళకు రఫ్ఫుతీసేది. మరోసారి

అది వెన్నెల రాత్రి అందరం డాబామీద పడుకున్నాము. జయరావు....ఇంకా కొత్త.... ఆ రాత్రి, కార్యం తంతు కాకముందే అరుణని తన దగ్గిరికి పంపమన్నాడు. అరుణ గజ గజ వొణికింది. తల్లి జాలిపడి నిరాకరించింది. కోపంతో డాబా మూల పడుకొని గుర్రు కొడుతున్నాడు.

అందరూ నిద్రపోతున్నారు. నిద్రరాదు. ఆ వెన్నెల్ని చూస్తే వెర్రి. పిట్టగోడ దగ్గిర నుంచుని కృష్ణకేసి చూస్తూన్నాను. సీతానగరం కొండల చీకట్లు ఏవో ఆశ కొలిపి బాధిస్తున్నాయి. పెద్దయినాక పిల్లలు "మామయ్యా, కొండెక్కుదాం," అంటే "ముళ్ళు, రాళ్ళు, ఎందుకు ఇక్కణ్ణించి చూడండి" అంటాము.

కాని చిన్నతనంలో, అదంతా – ఇంద్రజాలం - కొండలు-తెలీని, అందని, ఆశపెట్టే స్వర్గద్వారాలు-స్త్రీ శరీరాలవలెనే.

నా పక్కనే గంధం పరిమళమూ, తలలో మరువం పరిమళమూ కలుపుతో వొచ్చి నుంచుంది అరుణ.

కొయ్య నిచ్చనకేసి చూపింది మాట్లాడకండా! యెక్కాము. ఆ నిచ్చెన యెక్కగలడా ఆ పొట్టతో జయరావు!

కూచోమని సౌంజ్ఞ చేసింది. ఆనందం, కారణంలేని ఆనందం పట్టలేక నవ్వింది. తల నా బుజం మీద ఆనించి మెడమీద ఒక్క చెయ్యి వేసింది. ఆకాశాన్నించి పూలు వర్షించాయి. కాని నరాల్లో కోలాహలం.

ఆమె పెదవులమీద ముద్దు పెట్టుకున్నాను. కొంచెంగా పెదవుల్ని కదిలించింది. నా పెదవుల కింద నా జన్మకి అది మొదటి ముద్దు. ఆమెకి

అంతే ననుకుంటా. ఆ ముద్దు తరవాత యెన్నేళ్ళొస్తేనేం? ఇంక సంబంధం విడుతుందా! అట్లా కూచున్నాము చాలాసేపు. అంతకన్న ఏమో చెయ్యాలని నాకు తోచలేదు; ఆ కొత్త యవ్వనంలో.

మళ్ళా నాలుగేళ్ళకి అరుణని జయరావు ఇంటోచూసి నప్పుడు.... యెదిగి పుష్పించిన ఆమె అందాన్ని చూసి వెర్రి పడి, ఆ రాత్రి పరిచయపు కన్డిమ్యయేషన్ని క్లెయిమ్ చేశాను. ఒక్క చూపుతో ఒక్క తల వూపుతో నన్ను సులభంగా దూరాన వుంచింది. కోపంతో మర్నాడే వెళ్ళిపోయాను.

ఇక వెర్రి పుట్టింది నాకు. ఏకో సంవత్సరపడలేదు గాని, అరుణ నాకు దక్కకుండా వుండడానికి వీల్లేదు. ఆ రాత్రి ఆ ముద్దుని కొంచెం పెదిమల్ని—ఎందుకు కదల్చాలి?

తిరిగి, తిరిగి ప్రయత్నించాను. లాభం లేదు – చివరికి ఆనాడు ఆ వొంటిరి యింటో ఒక అపురూప సంఘటనవల్ల అసాధారణ అదృష్టం వల్ల నా కోర్కెని సాధించుకున్నాను.

నిద్ర పట్టింది గావును నాకు.

"పిచ్చిబాబూ, పిచ్చిబాబూ."

అరుణ నిజంగా యెదురుగా నుంచుంది. ఈనాటి నలిగిపోయిన పిచ్చి అరుణ.

"మాట, లేచి రా."

లేచాను. అందరూ నిద్రపోతున్నారు జయరావు తప్ప. జయరావు ఏమీ అనడు నా మీద చాలా నమ్మకం.

ధీరుల్ని, అజానుబాహుల్ని, సురూపుల్ని, అర్జునుల్ని మన్మథుల్ని, కిరాతార్జునుల్ని (పేమిస్తారు — అదవాళ్ళు అంటారా కవులూ, మను షులా? పూర్వమే మోగాని ఈనాడు అట్లాలేదు లోకం. ముఖ్యంగా ధనాన్ని, అధికారాన్ని (పేమిస్తున్నారు స్త్రీలు ఈ దేశంలో. తరువాత ఏమీ ఆకర్షణ లేక, నిస్సహాయులు లాగు కనపడే అర్భకుల్ని కురూపుల్ని (పేమిస్తున్నారు.

నమ్మాడు జయరావు నన్ను. అదిగాక రాత్రి దొంగల్ని పట్టడం సులభం కాని, పగటి దొంగలు పట్టబడరు. దొంగిలిస్తున్నారో, అరువు తీసుకుంటున్నారో నిర్ణయించలేరు స్వంతదార్లు.

మెట్లకి అడ్డంగా పర్వతంలాగు ఆచారి పడుకుని వున్నాడు. నల్లగా నెల్లూరి పంగనామాల పందికొక్కు జ్ఞాపకం వొచ్చింది నాకు—కొంచెం తెనాలిది కూడా. మెట్లమీదే.

"వా డెవడు?"

"వాడా—వెధవ! ఈ మొగవాళ్ళు—థూ!!! నిన్ను కాదే పిచ్చి ముండా!"

"ఏమిటా జపం?"

పెద్దగా నవ్వింది. నవరాత్రుల జేగంటలు మోగాయి నా చెవుల్లో.

"నన్ను చూస్తేనే ఆ జపం?"

"ఆ మంత్రం యేమిటో తెలుసా?"

"ఏదో భగ —"

"అదే ఆ సందర్భమే! భగవతీ భిక్షాందేహి!"

"ఆ భగవతి—నే నుట! భిక్ష యేమిటో ఆలోచించుకో!"

"బాబా!"

"వాడే! ఓసారి నన్నూ, ఆ కుమారస్వామినీ, వొంటరిగా చూశాడు బావి దగ్గర, ఆనుకుని నుంచోడం. మెల్లిగా చిన్న చిన్న బెదిరింపులు ప్రారంభించాడు. జయరావుతో చెపుతానని. మొహాన నవ్వాను. చెప్పాడు. ఆయన చెప్పిన వాణ్ణి ఇంటోంచి వెళ్ళకొట్టడానికి సిద్ధమైనారు. ఆనాటి నుంచి యేం చాతకాక యీ జపం ప్రారంభించాడు. ఆ యింట్లోట, నేను కలకాలం కాపరం చెయ్యాలిట!"

బాదం చెట్టు కింద అరుగు దగ్గిరికి వెళ్ళాము. ఆకాశం కొంచెం యెర్రబడ్డది, కోయిల అరుస్తోంది.

"చూడు, వ్యవధిలేదు. విను. నన్ను సిగ్గులేని దాన్ని అనుకోకు. ఏం? ఎందుకంటే మామూలు ప్రణయాలికీ, వ్యవధిలేదు. చూడు రాత్రంతా నేను కావాలని గోలపడ్డావు కాదూ?"

వొప్పుకున్నాను.

"ఎందుకు?"

"అంతే!"

"మొన్న రాత్రి లేంది—"

"అదే ఆశ్చర్యం—కాని యెంత కావాలనిపించావు? ఈ గోలతే రాకపోతే పిచ్చెక్కి నిన్నేం చేసేవాణ్ణో!"

"ఎందు కనుకున్నావు? నేను కోరుకొన్నాను, నువ్వు నన్ను కాంక్షించాలని. ఎందుకా? కొంటెతనం? మొగవాడు యెందుకు అంత సుఖంగా నిర్లక్ష్యం చెయ్యాలి? అని ఉడుకుమోతుతనం."

ఆశ్చర్యంతో చూశాను.

అబద్దాల యింద్రజాలంలో శృంగార మాయలో తేలిపోయే అరుణ యిట్లా మాట్లాడుతోంది.

"అట్లా చూడకు. మాయా, అబద్ధం అన్నీ తెగిపోయినాయి యీ జీవితానికి. వాస్తవం, సత్యం, యెంతసేపు గ్రహించడం?—బుద్ధుడు అన్నాళ్ళు తంటాలుపడి చివరికి జ్ఞానం కలగడం రెండు నిమిషాలు రమణ మహర్షికి ఎంతకాలం పట్టింది విరక్తి కలగడానికి."

ఇవన్నీ యెప్పుడు చదివింది?

"నీకు కూడా వైరాగ్యాన్ని కలిగిస్తున్నానా? వీల్లేదు. తెల్లారిందాకా నువ్వు నా మాయలోనే బతకాలి."

ఒక్క వూపుతో, మంత్రం పెడుతున్న దానికిమల్లే జుట్టుని ముడి నించి వొదిలించి నా కళ్ళమీద కప్పింది విశ్వనాథ ఆయిల్ పరిమళాలు వెదజల్లుతో.

"కావాలా నేను యింకా?"

నా నోటిమీద పెదవుల్ని అనించింది. ఇంకా రాత్రి తాంబూలంతో తియ్యనైన పెదవుల్ని అట్లానే నా నోట్లోకి మాట్లాడుతోంది.

"మొగవాళ్ళు మమ్మల్నేదో ఆకర్షిస్తున్నామనీ, బంధిస్తున్నామనీ కులుకుతారు. మమ్మల్ని! వెర్రివాళ్ళు! పాపం నన్ను కోరావు—అవునా? నువ్వా కోరింది?" నవ్వింది. నోట్లోంచి నా తల లోపలంతా నవ్వులు. చెవులంతా గంటలు-చెర్చి అల్లరి గంటలు! నాలుగువేపులా పరుగెత్తి మారుమోగాయి.

నా తల నట్లానే బలువుగా అరుగుమీదికి వొంచి తన బలువుతో నా మీద పడుకుంది.

ఇంక వొళ్ళెరగను.

నా నరాలన్నీ గుమిగూడి ఆమెని పెనవేసుకున్నాయి.

"నేను పిరికి పెధవని. ఇందాక భయపడ్డాను. ఏమైనా కానీ, నువ్వు నాతోనే వుండు—వెళ్ళకు. నా దగ్గిర్నించి వెళ్ళకు."

అప్పుడు మాట్లాడలేదు. నవ్వుతో —

"పిచ్చిముండా?" అని నా కళ్ళని ముద్దు పెట్టుకుంది.

తల తిరిగింది. భూమి,ఆకాశమూ,చెట్లూ, ఇల్లూ ఒక్కగొప్పకాంతితో ఆ కాంతిలో ఏకమైపోయినాయి. అట్లా ఆమె మొహం నా మొహంమీద అనుకుని ఆమె చేతులు నన్ను దగ్గిరికి లాక్కుంటూ యింత విడిపడడం లేకండా యిద్దరమూ రాళ్ళమైపోతే -

* * *

బాగా యెర్రబడ్డది లోకం. పడమటివేపున కొండల వంటి మబ్బులు

అగ్నుల్ని కక్కుతున్నాయి ప్రపంచంమీద. చామ ఆకుమీది నీటిబొట్టు పెద్ద కెంపులాగు మెరుస్తోంది.

"తరుణారుణపే రంజిత ధరణీ–" అని పాడాను, అరుణకి చూపుతో.

"ఈ ఆరుణ, తరుణ కాదు" అని పెదవి విరిచింది.

అరుణ జుట్టు చల్లగావుంది. గోరింకలు రెండు చెత్తని కెలుకుతున్నాయి నిద్రకళ్ళతో.

గాలి ఆమెని తాకి, నా వొళ్ళోకి వొచ్చి నా చంపల్ని అదిమింది. పక్కన దానిమ్మ చెట్టుమీది యెర్రని పువ్వుల్ని చూసి వాటితో ఆడుకోడానికని ఎగిరింది. బాగా ఎర్రపడ్డది లోకం.

"బాధ పరిహార మయిందా?"

సిగ్గుతో ఆమె తొడలలో మొహాన్ని దాచుకున్నాను.

"ఇంక శలవు."

"ఎక్కడికి."

"తెలీదా?"

"వొద్దు, నాతో - "

"నీతోనా పిచ్చిముండా?"

"వుండాలి."

"చూడు వుంటే నీకు వెర్రెత్తిస్తాను. నీకు నిమిషం విశ్రాంతి నివ్వను. అంత మంచివాడివా? స్వార్థం యెరుగని వాడివా? నువ్వుకూడా·····

చూడు మొగాళ్ళే - మొగాళ్ళే ఏమిట్లే, అందరూనూ-నాకు, నాకు అంటూ దాచుకుంటారేం? కరుముకుని పీక్కుని చీల్చుకుంటారేం? ఏదో తినేదీ అయి పోయేదీ అయితే అనుకోవచ్చు. తమ ఇంట్లో పెద్దదీపం పొరుగింటి గోడ మీద పడుతూందనీ, కిటికీలు మూసుకుంటారు, తమకి గాలిరాక చచ్చినా సరే. వాళ్ళకి కాంతి-తమ కాంతి స్వంతం అక్కర్లేక మిగిలింది-అది మాత్రం ఇంకోళ్ళకెందుకు పోవాలి? కొందరు దీపం ఆర్పేసుకునేవాళ్ళు కూడా వున్నారు మహానుభావులు. కసితో నేలకేసి బద్దలుకొట్టేవారు. ఛీ పాడులోకం మళ్ళీ అందమంటే మొగాళ్ళకి ఎంత కక్కుర్తి! కంటబడితే చాలు" అంది.

"అందమైన స్త్రీలని హక్కుదార్లు దాచుకోవడం వల్ల ఒచ్చిన ఫలితం" అన్నాను, దాచుకోడానికి స్త్రీ లేని నేను నా బతుకంతా అన్విల్లింగ్ పబ్లిక్ చారిటీ unwilling public charity మీద గడుస్తోందనే కృతజ్ఞత కూడా లేకుండా.

"ఏ స్నేహితుడి కళ్ళలోనో ఆరాధనని చూసి, అప్పుడు జ్ఞాపకం తెచ్చుకుంటారు. భార్య అందమైనదని. అక్కణ్ణించి అనుమానాలు మొదలు. ఈ అందానికి అధికార్లు కావడం ఎంత నీచం-ఎంత బాధ-యెంత యీర్ష్య, కాని ఆ బాధంతా పడతామంటారు. ఒక్కరవ్వ అనుభవించరు. కాని ఒదలరు.

"ఈ మొగాళ్ళు అందం తమకి దక్కకండా కళ్ళబడిందా 'కుయ్యో, కుయ్యో'మని వెంటపడతారు. సోడాలు, చీరెలు, ఫలహారాలు, చెయిన్లు,

చోకలెట్లు, పర్సులు-వర్షిస్తాయి, ఆమె దోవ పొడుగునా. చస్తున్న ముసలి దానికి-చంటిబిడ్డ పాలకోసం దేవుళ్ళాడే తల్లికి. కాని చాలదు, ఛీ వెధవ అందం."

నా మొహంవంక చూసి నా ఆలోచనలని అర్థం చేసుకుంది. అంత దివ్యదృష్టి ఒచ్చింది ఆమెకి. ఆ వుదయాన, సూర్యోదయం ముందు.

"అవును, ఎందుకా? భరించలేను. మొగవాడు, ధీరుడు. బలశాలి. అట్లా నా కోసం బాధపడుతో ప్రాధేయపడితే భరించలేను. పరమ అసహ్యం నాకు వాళ్ళనిచూస్తే. కాని, వాళ్ళనించి ఏదో గొప్పగా, యీ పాడుశరీరాన్ని దాచుకుంటే నా మీద మరింత అసహ్యం."

మళ్ళీ చూసింది నా వంక లోతుగా.

"అవును; పాడు శరీరం కాక - అదంతా నీ కళ్ళు. నీ మొహం కల్పించుకున్న యింద్రజాలం. నీ రక్తంలోని ఉడుకు-నిజం చెప్పు. ఇందాకటంతా వాంఛనీయంగా, అద్భుతంగా కనపడుతున్నానా నీ కిప్పుడు?"

"ఆ" అని వెక్కిరించింది.

"ఇందాకనే ఐతే ఇంతసేపు నిదానంగా మాట్లాడనిచ్చే వాడివానన్ను. మాయలూ, మర్యాదలూ మానెయ్యి. ఈ వుదయం యీ ఒక్క వుదయం హృదయాలు విప్పి నిజం మాట్లాడుకుందాం "

"తరువాత మరి నాతో."

"తరువాత మాయో, వాస్తవమో, నిద్రో, కలో- ఎవరికి తెలుసు?"

"వెళ్ళిపోతావా? నన్ను నమ్మవా?" నా కళ్ళంబడి నీళ్ళు.

"నా కోసం దుఃఖించకోయ్! నేను బాగానే వుంటాను. కాని నువ్వూ? నే నింక కనపడనే! నీకు కనపడనిదేమో! నువ్వూ! పిచ్చిముండా. యింత పిచ్చిముండవి ఎట్లా బతుకుతావు. నేను లేక! నిన్ను చూస్తే నా కెంత జాలి! చూడు నిన్ను ఎట్లా సంతుష్టి పెడదామా అనిపిస్తుంది."

నా అహంభావం గాయపడ్డది. ట్యూషనుకి వొచ్చే లిల్లీ హృదయాన్ని ఆకర్షించగలిగాననే అహంభావం.

"జాలి చేతనా?"

"ఇదుగో—ఆ తర్కాలన్నీ మరిచిపో. మాటలు, మాటలు, జాలీ, ప్రేమా, మోహం, వాంఛా! మాటలు—శత్తమాటలు. ఎవరికి తెలుసు భేదాలు అసలు వున్నాయా? ఏదో హృదయంలో ఆరాటం తెలియచేసే విధం తెలీక మాటలు. పనిలేని మాటలు. మాటలురాని మృగాలు ఒక దాన్నొకటి చక్కగా అర్థంచేసుకుంటా యనుకుంటాను..."

"మరి యింక పెడతాను మొహం చూడనీ; మళ్ళీ యెప్పుడు?—"

"నేను వొస్తాను మీ వూరు"

"వొస్తే యేం లాభం?"

"ఏమి?"

"అంతా నిశ్చయమైపోయింది. నిశ్చయం చేశారు...అందుకనే ఆఖరుసారి జన్మానికి చివరిసారి నీ దగ్గిరకి వొచ్చాను. నీ మీది కృతజ్ఞతను చూపుకోడానికీ, నీ ప్రేమరుణం తీర్చుకోడానికి. నువ్వే—నిజంగా పిచ్చి ముండవి. లోకానికి తగవు, యీ పాడులోకానికీ, నీ మీది ఎంతో జాలి. ఎంత యిష్టం—ఎట్లా చూపను? నీ కట్లా అనిపిస్తుందా? ఎట్లా చూపడం? మన ప్రేమ! ఎంతైనా యీ చేతులూ, పెదిమలూ, కళ్ళూ, వీటిని మించి నా మనసులో—ఆత్మలో కొట్టుకునే అసలు నీ మీది యిష్టాన్ని చూపలేను. కద! యిట్లా తప్ప..."

"అది సరే, నువ్వేమౌతావు?"

"తెలీదు. కాని భవిష్యత్తు నిశ్చయించేశారు."

"ఎవరు?".

"నా అధికార దేవతలు, నా అదృష్ట దేవతలు. నాకేముంది యీ శరీరంగాక? ధనమూ, గానమూ, దేనితో యీ లోకాన్ని నాదిగా ఆకర్షించుకోగలను? నా సౌందర్యం ఒకటే నాకు దేవతలిచ్చిన వరం. ఆ వరాన్ని ఉపయోగించి నప్పుడల్లా లోకం నన్ను కరిచింది. కాని, యీ అంధకారంలో ఆకాశం కొంచెంగా తెరుచుకుంది. కొత్తవిధం ఆనందానికి కొత్త ద్వారం కొంచెంగా తెరిచారు. ప్రయత్నిస్తాను. ఈ శరీరాన్ని యీ మొద్దుని. భారాన్ని అతిక్రమించి ఎగరడానికి చూస్తాను, నేనేం చెప్పలేను."

ఆకాశం వంక చూస్తోంది. కళ్ళు నీళ్ళతో నిండాయి.

ఏం చెయ్యను సహాయం?

"వాళ్ళిద్దరూ?"

పోనీ అదన్నా ఆమెని కదులుస్తుందేమో!

"వాళ్ళిద్దరూ—చూడు ఆ మబ్బు వెనకనించి చిమ్మే ఆ కిరణాలు—వాటిల్లో రెండు కిరణాలు వాళ్ళ ప్రేమే" ఆగింది.

నాతో మాట్లాడంలేదు. తన ఆత్మకి తను బోధించుకుంటోంది.

"ప్రేమ-ప్రేమ విచిత్రం. నాకేనో అందరికీనో! చూడు ఆ కిరణాలన్నీ ఒక్కటీ వృథాపోక, నా కళ్ళలోకి రావాలనిస్తుంది. ప్రతి మానవుడూ, ప్రతి అందమూ, అన్నీ నా కోసమే—నా ఆనందానికే—నా లోపలికే అన్నీ, అన్నీ యీ ప్రపంచమంతా—"

"అంతాకూడా నాది! నా స్వంతం, నా హక్కు అనిపిస్తుంది. కాని యీ దేహం అడ్డం నుంచుంటుంది. అత్తగారిమల్లే "నా ద్వారా నా పుత్తరువు మీద-" అంటుంది. దేహమంటే కోర్కెల పుట్ట. చాతగాక, స్వేచ్ఛలేక, అన్నీ అక్కడ అర్పిస్తాము. దాన్ని కామం, జారత్వం, లోలత్వం, చంచలత్వం అంటుంది లోకం. నాకింకా ఆకర్షించగల దేహమన్నా వుంది కాని"

"కాని—"

చప్పున నా వంక చూసింది. వొంటరిగా వొంగతనం చేసేవాణ్ని ఎవరో పలకరించినట్టు...

"ఏం లేదు." అని లేచి నించుని ఆలోచించింది. చప్పున— "నీతో ఒక రహస్యం చెపుతా. నేనింతవరకు ఎవర్నీ ప్రేమించలేదు. ఇప్పుడు తలుచుకు చూసుకుంటే నా హృదయంలో గొప్ప ప్రేమ వుంది. ప్రేమించాలనే ఆశ అపారంగా వుంది. అందువల్లనే యివన్నీ. కాని నా ఆదర్శమే అతి వున్నతం. నా పురుషుడు ఒక్కడే నా కలల్లో బతుకుతున్నాడు, నిరంతరం నా కేసి చేతులు జాస్తో. ఈ మనుషుల్ని చూస్తే, వాళ్ళ లోపాలు, దేహ లోపాలూ, గుణలోపాలూ, అన్నీ కనపడతాయి. ఒక్కటి చూడు! అబ్బా! ఎంత వికృతం. ఎంత నీచం. ఆ నిమిషాన మొగాడి స్వరూపం. రోడ్డుమీద కుక్కల్ని చూడమూ, అదే జ్ఞాపకమొచ్చి నవ్వు ఆపుకోలేను. తననెంతో మోహించి చేతులో చిక్కాననుకుని కులుకుతున్న మొగాడు ఆశ్చర్యపడతాడు నా నవ్వు చూసి. నాకు మనుషుల్లోనే ఒకరికీ ఒకరికీ భేదం నశించింది. అందరూ అంతే. ఏంచేస్తారు పాపం! అంతకన్న చాత కాదు. మనుష్యత్వాన్ని అతిక్రమించాలని ప్రయత్నిస్తారు కొందరు నీ దోటి వాళ్ళు. కాని, పాపం చేత కాదు. శరీరం ఒక్కటే ప్రేమ సాధనం. ఏ నీచుడైతేం? భర్త ఐతేనేం, బ్రాహ్మడైతేనేం ఆ మహాత్మ దీనుడైతేనేం? ఏదో కాలక్షేపానికి! ఎవరికో ఒకరికి తృష్ణ తీర్చడం. కాని యీ మొగాళ్ళ-చూశావుగా రాత్రి? అదీ రకం!

"రాహూ, ఎవరినన్నా కొంచెమన్నా ప్రేమించానా అంటే— నిన్నే. అందుకనే నీ పాదాల వద్దే నిష్క్రమిస్తున్నాను."

"రాహూ" అని నన్ను గట్టిగా, అతి జాలిగా, తన ప్రాణమంతటితోనూ కావలించుకుంది.

ఆమె లేవడంతోటే మంచుకుపోయినట్టు పక్క మేడ మీద నించి గ్రామఫోను వినపడ్డది—

"సునో ముసాఫిర్ బాజతు ఢంకా!

కిం మతలబ్ మే సోతాహై"

ఆకాశవాణిని విన్నట్టు నుంచుని ఒక్క నిమిషం విన్నది.

"సునో-బాజతు ఢంకా!—ఇంక టైమ్ లేదు" అని పరిగెత్తి మేడ మీదికి వెళ్ళింది. వెనకనే నేనూ వెళ్ళాను.

"రైలు టయిమయింది. లేవండి" నవ్వుతో గంతులేస్తో అరిచింది.

అందరూ కళ్ళు నులుముకుని ఆశ్చర్యంతో చూస్తున్నారు.

"ఇంకా ఆరుకాలేదు, అప్పుడే ఏమి టయిము? పడుకో!" అని కళ్ళు మూసుకున్నాడు జయరావు. "మన రైలు పదకొండింటికి" అని మూలిగింది ముసలమ్మ.

"భగవతీ" అన్నాడు బిగ్గిరగా పంగనామాలు— తావళం కోసం వెతుకుతో.

"సునో ముసాఫిర్ బాజతు ఢంకా. అందరిదీ ఒకటే రైలు కాదు. కొందరి రైలు మూడింటికి, కొందరిది ఆరింటికి, కొందరిది పదింటికి. నా రైలు-ఆరింటికే వొచ్చింది. గుడ్‌బై ఆల్ అని గంతులేస్తో గదిలోకి వెళ్ళి పడుకుంది.

ఏ తొమ్మిదింటికో లేచారు. మొహాలు, వొడ్లు, సామాన్లు, బళ్ళు, ఇద్దెనులు, కాఫీలు, రాత్రి కోపాలన్నీ పోయినాయి. బీస్తు, సాయేబూ, జయరావూ అందరమూ ఒకటే బల్ల దగ్గిర.

అరుణ మాత్రం ఎంత సేపటికి రాదు.

అంతటా వెతికాము. ఎక్కడాలేదు. ఎంత వెతికినా లేదు. ఏ సామానూ పోలేదు.

ఒక్కరూ కదలదు. వారంరోజులు వెయిట్ చేశాం. నా దుఃఖంతో నశిస్తో, నేను బడికి వెళ్ళి పని చేస్తో, వాళ్ళందరికీ సప్లయిలు.

అంతే. ఈ నాటికీ కనపళ్ళేదు.

ఏమయిందా? అదే సమస్య. చచ్చిపోయిందా? ఎవరమూ నమ్మలేము. చచ్చిపోవడం ఆనందంతో పూగే జీవితాన్ని ఎందుకులే అని తృణప్రాయంగా త్యజించి జీవిత జలధి లోతు ఎంత వుందో అని దూక గలగడం మహా సాహసం. ఈ మామూలు అత్తగారి మీద కోప మొచ్చి, బావిలో దూకడాలు కాదు. కాని ఆత్మహత్య ఎప్పుడూ అపజయ చిహ్నమే! ఎంత జారుడుగా వున్నా, సర్పాలు చుట్టుకున్నా, వొడ్డు నించే కొనగలవారు అంతకన్న ధీరులు. వొప్పుకోము. అరుణ జీవితానికీ, భర్తలకీ భయపడ్డదని, ఏం జరిగిందో, భర్తని నిరాకరించి ఆ గదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్న నిమిషానికీ, మళ్ళీ వొచ్చి అద్భుతంగా నన్ను లేపి తోటలోకి తీసుకు వెళ్ళిన నిమిషానికీ, మధ్య, ఆమె ఆత్మలో-ఎవరికి తెలుసు?

ప్రతి సంవత్సరమూ నేను, బీస్ట్, నాగన్, ఇంకా నలుగురూ ఆ రోజు సాయంత్రమే కలుసుకుని, షాంపెయినులో అరుణ రసికత్వాన్ని తలుచుకుంటూ, రాత్రి గడుపుతాము. ఎంత పని వున్నా సరే, ఎంత దూరాన వున్నా సరే.

కాని అరుణ చచ్చిపోలేదు, నాకు తెలుసు, మబ్బుల్లో చిన్న బిడ్డల లేత మడమల మీద, కందిన ప్రియురాలి పెదవి మీద, రోజా పువ్వు రేకుల్లో, పద్మాల నడుమ, తాగిన మా కళ్ళ కొలుకుల్లో, ఎరుపు జీరల్లో నశించలేదు.

జీవితంలో యీ దేహానికి నా శృంగార భావాలకి యెట్లా స్వర్గ ద్వారాలు తెరిచిందో, అట్లానే నా ఆత్మకీ, నా ఆధ్యాత్మిక సందేహాలకీ ఎప్పుడో, ఏ ఆశ్రమం నించో, స్వర్గద్వారాలు తెరుస్తుందని నా నమ్మకం.

—: సమాప్తం :—